# చందమామ

ఏప్రిల్ 1971

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.











# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి...
# రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టిన దని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ ప్రకటింపబడనటు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటె: కాల్గేట్ డెంటల్ క్రీముతో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ ఋజువు ఉన్నది! ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీముతో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు ఇష్టపడతారు!







శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్‌కంటె కాల్గేట్‌నే కొంటారు!

DC.G.41 TL

# తియ్యని మిఠాయి



చెన్నాపట్నం చెఱుకో ముక్క
నీకో ముక్కా నాకో ముక్కా
**న్యూట్రిన్** స్వీట్లు నీకూ నాకూ
తియ తీయని నారింజ క్యాండీ
కమ్మ కమ్మని కొబ్బరి బోన్ బోన్స్
ఘమ్ ఘమ్ మనే అనాస టాఫీ
ఎన్నోగలవు **న్యూట్రిన్** స్వీట్స్
చెమ్మా చెక్కా చేరడేసి మొగ్గా
చెన్నాపట్నం చెఱుకో ముక్కా
**న్యూట్రిన్** స్వీట్లు నీకూ నాకూ



NCM 15 TEL




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర)



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

డబ్బు విలువ క్రమంగా క్షీణిస్తూ అన్ని వస్తువుల ధరలూ పాపం పెరిగినట్టు పెరిగిపోతున్నాయి. పత్రికలకు కూడా ఇదే దుస్థితి ఏర్పడింది. కాగితం మొదలుకొని ముద్రణ వ్యయాలన్నీ పెరిగిపోయాయి. ఈ కారణంగా వచ్చే జులై నెల నుంచి, "చందమామ" ధర 90 పైసలకు పెంచుతున్నామని చెప్పటానికి విచారిస్తున్నాము.

సంపుటి 48 ఏప్రిల్ '71 సంచిక 4








క్వచిత్ పృథ్వీశయ్యః, క్వచి దపి చ పర్యంకశయనః,
క్వచిత్ శాకాహారః, క్వచి దపి చ శాల్యోదనరుచిః,
క్వచిత్ కంథాధారీ, క్వచి దపి చ దివ్యాంబరధరః,
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖం. 1

[కార్యార్థి అయినవాడు నేల మీద పడుకున్నా, పరుపు మీద పడుకున్నా, కాయకూరలు తిన్నా, సన్న బియ్యం అన్నం తిన్నా, బొంత కట్టినా, పట్టు పీతాంబరాలు కట్టినా, దుఃఖం కలిగినా, సుఖం కలిగినా లక్ష్యపెట్టడు.]

నిందంతు నీతి నిపుణా, యది వా స్తువంతు,
లక్ష్మీః సమావిశతు, గచ్ఛతు వా యథేష్టం,
అద్యైవ వా మరణ మస్తు, యుగాంతరే వా,
న్యాయ్యాత్ పథః ప్రవిచలంతి పదం న ధీరాః. 2

[నీతి ఎరిగినవారు తిట్టనీ, మెచ్చుకోనీ; సంపద రానీ, పోనీ; చావు ఈ క్షణంలోనే రానీ, యుగాంతం దాకా రాక పోనీ, ధీరులు న్యాయమార్గం నుంచి ఒక్క అడుగు తొలగరు.]

కదర్థిత స్యాపి హి ధైర్య వృత్తేః న శక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుం,
అధోముఖ స్యాపి కృతస్య వహ్నేః నాధః శిఖా యాతి కదాచి దేవ. 3

[ఎంత హీనస్థితికి వచ్చినా ధీరుడి ధైర్యం తుడిచి పెట్టుకుపోదు; తలకిందులు చేసిన అగ్నిజ్వాల కిందికి ప్రసరించదు.]

ధీరులు



# ప్రాణగండం

ఉత్కళదేశంలో గుర్రాలను దొంగిలించటం జాస్తిగా వుండేది. పట్టుబడిన దొంగలకు శిక్షలు కూడా కఠినంగానే ఉండేవి.

ఆ కాలంలో ఒకపేద దైవజ్ఞుడు ఊళ్ళ వెంబడి సంచారం చేస్తూ ఒక రాత్రి ఒక గృహస్థు ఇంట పడుకున్నాడు. ఆ రాత్రే ఆ గృహస్థు ఇంట ఉన్న ఆడగుర్రం ఈనటానికి సిద్ధంగా ఉన్నది. అందుకోసం ఇంటి యజమానీ, ఆయన కొడుకూ ఆ రాత్రి నిద్ర పోకుండా మేలుకుని ఉన్నారు. అర్ధరాత్రి వేళ దైవజ్ఞుడు బయటికి వచ్చి, ఆకాశంలోని నక్షత్రాల కేసి చూసి, ''ఈ గుర్రం ఇంకొక్క అరగడియ ఈనకుండా ఆపే దారి లేదా?'' అన్నాడు.

''అదెలా సాధ్యం?'' అన్నాడు గృహస్థు.

''మరేమీ లేదు. ఇప్పుడు పుట్టే ఈ గుర్రపు పిల్ల మూలాన ఇద్దరు మనుషులకు ప్రాణగండం ఉన్నది,'' అన్నాడు దైవజ్ఞుడు.

ఆ దుర్ముహూర్తంలోనే గుర్రపు పిల్ల భూమి మీద పడింది.

''ఇప్పుడేం చెయ్యమంటారు?'' అని గృహస్థు దైవజ్ఞుణ్ణి అడిగాడు.

''చేసే దేమీ లేదు. నేను చిన్న రాగి రేకు మీద యంత్రం వేసి ఇస్తాను. గుర్రపు పిల్ల నుదురు మీద చర్మం చీల్చి, యంత్రం లోపల పెట్టి, మళ్ళీ చర్మం కుట్టెయ్యండి,'' అన్నాడు దైవజ్ఞుడు. గృహస్థు అలాగే చేశాడు. దైవజ్ఞుడు తన దారిన వెళ్ళిపోయాడు.

గుర్రపుపిల్ల బతికింది. దానికి ఆరేళ్ళు వచ్చేసరికి అది చాలా మంచి గుర్రంగా తయారయింది. ఒక రాత్రి దొంగలు ఆ గుర్రాన్ని అపహరించారు. యజమాని ఉదయం వచ్చి చూసుకునేసరికి గుర్రపు సాలలో గుర్రం లేదు. ఎవరు దాన్ని ఎత్తుకు పోయి ఉంటారో కూడా ఆయన ఊహించ లేక పోయాడు. ఆయన తన కొడుకుతో,

ఎల్. భాస్కరరావు




"నేను గుర్రాన్ని వెతకటానికి పోతున్నాను," అన్నాడు.

"నువు ఒక్కడివే వెళ్ళవద్దు. నేను కూడా వస్తాను," అన్నాడు కొడుకు.

"నువు కూడా దేనికి? ఎంత దూరం తిరగవలిసి ఉంటుందో ఏమిటో," అన్నాడు తండ్రి. కొడుకు వినిపించుకోలేదు. తండ్రి కొడుకులిద్దరూ గుర్రాన్ని వెతుకుతూ బయలుదేరారు.

వాళ్ళు చాలా గ్రామాలు తిరిగారు. మధ్యలో వర్షం వచ్చింది. ఆ వర్షంలో ఇద్దరూ తడిసిపోయారు. చలికి వణుకుతూ వాళ్ళు ఒక గ్రామం ప్రవేశించేసరికి వీధి వెంట ఒక మనిషి ఒక గుర్రాన్ని ఎక్కి, రెండో గుర్రాన్ని నడిపించుకుంటూ తమకేసి వస్తూ కనిపించాడు.

కొడుకు తండ్రితో, "నాన్నా, ఆ రెండో గుర్రం మనదే!" అన్నాడు.

"ఎలాచెప్పగలవు?" అన్నాడు తండ్రి.

"మన గుర్రం నాకు గుర్తే, నాన్నా," అన్నాడు కొడుకు.

వాళ్ళు ఇలా మాట్లాడు కుంటూండగానే గుర్రాల వెంట ఉన్న మనిషి మధ్యలో ఆగి ఒక కమ్మరి దుకాణంలోకి ప్రవేశించాడు.

"మనం కూడా అక్కడికిపోయి గుర్రాన్ని సరిగా చూద్దాం," అన్నాడు తండ్రి. ఇద్దరూ కలిసి కమ్మరి దుకాణం దగ్గిరికి వచ్చారు.

కమ్మరి రెండో గుర్రానికి లాడాలు వెయ్యబోతూ, తల ఎత్తి తండ్రి కొడుకులను చూసి, "తడిసినట్టున్నారు. లోపలికి వచ్చి, కొలిమి దగ్గిర కూర్చుని చలి కాచుకోండి," అని వాళ్ళను ఆహ్వానించాడు.

తండ్రి కొడుకులు కొలిమి దగ్గిర కూర్చుని గుర్రాన్ని పరీక్షగా చూశారు.

"అవునురా, అది మన గుర్రమే!" అన్నాడు తండ్రి కొడుకుతో.

"నేను చెప్పలేదా, నాన్నా?" అన్నాడు కొడుకు. గుర్రాల వెంట వచ్చినవాడు వాళ్ళ మాటలు విని, "ఏమిటీ?" అన్నాడు.

"ఇది మా గుర్రం. దీన్ని ఎవరో ఎత్తుకు పోయారు," అన్నాడు తండ్రి.

"అలా దొంగతనాలు అంటగట్టితే మర్యాదగా ఉండదు. ఇది మా దగ్గిరే పుట్టి పెరిగిన గుర్రం," అన్నాడా మనిషి.

తండ్రి కొడుకులు న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళి ఆ మనిషి మీద ఫిర్యాదు చేశారు. న్యాయాధికారి పిలిపిస్తే ఆ మనిషి తన వెంట మరొక మనిషిని తెచ్చాడు.

ఇద్దరూ న్యాయాధికారి దగ్గిర చెప్పారు: ఆ గుర్రం వాళ్ళ కళ్ళ ఎదటనే పుట్టింది; అది ఇన్నేళ్ళూ తమ దగ్గిరే పెరిగింది.

తండ్రి కొడుకుల తరపున ఎలాంటి సాక్ష్యం లేదు.

"మీరు అబద్ధాలు చెప్పి ఇతరుల గుర్రాన్ని కాజెయ్య జూసినందుకు ఉరిశిక్ష విధిస్తున్నాను," అన్నాడు న్యాయాధికారి.

వాళ్ళను ఊరిబయట ఉరితీయడానికి భటులు తీసుకుపోయారు. ఉరికి సన్నాహాలు జరుగుతున్నాయి.

"ఆ గుర్రం పుట్టినప్పుడే దైవజ్ఞుడు చెప్పాడు, ఇద్దరికి ప్రాణగండం ఉన్నదని!" అన్నాడు తండ్రి.

"ఆయన గుర్రం తలలో పెట్టి కుట్టించిన యంత్రం కూడా ఎందుకూ పనికిరాలేదు!" అన్నాడు కొడుకు.

"అవునన్నట్టు! ఆ యంత్రం ఇంకా దాని చర్మం కింద ఉండే ఉంటుంది!" అన్నాడు తండ్రి.

తన సమక్షంలో ఉరిశిక్ష అమలుజరపటానికి న్యాయాధికారి స్వయంగా వచ్చాడు.

"అయ్యా, న్యాయాధికారిగారూ! ఆ గుర్రం ముఖం మీది చర్మం చీల్చి చూడండి. లోపల యంత్రం వేసిన రాగిరేకు ఉంటుంది. లేని పక్షంలో మమ్మల్ని ఉరి తీయండి," అన్నాడు తండ్రి.

కత్తి తెచ్చి గుర్రం ముఖం మీది చర్మం కోశారు. లోపల రాగిరేకు ఉన్నది.

న్యాయాధికారి తండ్రి కొడుకులకు ఆ గుర్రాన్ని ఇప్పించి, అది తమది అని చెప్పిన ఇద్దరినీ అప్పుడే ఉరి తీయించాడు.

దైవజ్ఞుడు చెప్పినది నిజం కావటమే గాక ఆయన పెట్టిన రక్ష కూడా ఆ తండ్రి కొడుకులను కాపాడింది.





# నచ్చిన బంటు

ఒక ఊళ్ళో దాముా, సోముా అని ఇద్దరు స్నేహితులుండేవాళ్ళు. ఇద్దరూ పేదవాళ్ళే కావటం చేత చిల్లర పనులు చేసుకుని జీవితం గడుపుతూ ఉండేవాళ్ళు. ఇందువల్ల వాళ్ళకు సరిగా జరుగుబాటు అయేదికాదు. అందుచేత వాళ్ళు కుదురుగా ఎక్కడన్నా నౌకరీ దొరుకుతుందేమోనని వెతకసాగారు.

పక్క గ్రామంలో ఉన్న జమీందారు గారింట నౌకరీ దొరుకుతుందని వాళ్ళకు తెలిసింది.

ఇద్దరు స్నేహితులూ ఒక రోజు తెల్లవారు జామునే లేచి జమీందారుగారి ఇంటికి వెళ్ళారు. వాళ్ళు పని కోసం వచ్చారని జమీందారుగారి మనిషి జమీందారుతో చెప్పాడు. జమీందారు వాళ్ళను చూడలేదు, లోపలికి రమ్మనలేదు, సోమవారంనాడు ఉదయం వాళ్ళిద్దరినీ కనపడమని తన మనిషి ద్వారా కబురు చేశాడు.

ఇద్దరూ కాళ్ళీడ్చుకుంటూ వచ్చిన దారి పట్టారు. "మాట్లాడేదేదో ఇప్పుడే మాట్లాడక, మళ్ళీ సోమవారం నాడు రమ్మనటమేమిటి?" అని సోము విసుక్కున్నాడు.

సోమవారం ఉదయం పెందలాడే నిద్ర లేచి దాము సోము కోసం వెళ్ళాడు. సోము ముసుగుతన్ని ఇంకా నిద్రపోతున్నాడు; "జమీందారు ఇంటికి పోదామా?" అని దాము అడిగితే, "తరవాత పోదాంలే. ఏం తొందర?" అని గొణిగాడు.

"నేను పోతున్నాను. కావాలంటే నువ్వూ రా!" అంటూ దాము బయలుదేరాడు. జమీందారు పొద్దున్నే రమ్మంటే పొద్దెక్కి పోవటం బాగుండదని అతను అనుకున్నాడు.

దాము బయలుదేరిన ఒక గంటకు సోము నిద్ర లేచి, తాపీగా తాను కూడా జమీందారు ఇంటికి బయలుదేరాడు. జమీందారు వెళ్ళగానే దర్శనం ఇస్తాడన్న నమ్మకం

ఏ. రమణయ్య

ఏమీ లేదు. అలాంటప్పుడు దాము ఊరు తెల్లవారకుండానే బయలుదేరటం దేనికో సోముకు అర్థం కాలేదు.

దాము రాగానే జమీందారు నౌకరు జమీందారుతో అతని రాక గురించి చెప్పాడు.

"రెండోవా డెందుకు రాలేదో కనుక్కో," అని జమీందారు తన నౌకర్ను పంపాడు.

"కొంచెం ఆలస్యంగా వస్తానన్నాడు," అని దాము నౌకరుకు సమాధానం చెప్పాడు.

"వేచి ఉండమను," అని జమీందారు తన నౌకరు ద్వారా దాముకు కబురు చేశాడు.

మరి కొంత సేపటికి సోము కూడా వచ్చి, "నేను చెప్పలేదా? నా కన్న ముందు వచ్చి ఏమి బావుకున్నావు?" అని దామును అడిగాడు.

మరి కొంత సేపటికి జమీందారు వచ్చి, "పని కోసం వచ్చినవాళ్ళు మీరేనా? ఇప్పుడు వెళ్ళిపోయి, బుధవారం ఉదయం కనిపించండి," అన్నాడు.

ఇద్దరూ మరొకసారి ఇంటిదారి పట్టారు.

"మనని ఈ జమీందారు నిష్కారణంగా శ్రమ పెడుతున్నాడు. బుధవారంనాడు వచ్చినా ఇదే జరుగుతుంది. ఆ రోజు రావటం వృథా," అన్నాడు సోము.

"పని కావలసినవాళ్ళం. ఖాళీగానే ఉన్నాం. ఎన్నిసార్లు తిరిగితే మాత్రం మన కేం నష్టం?" అన్నాడు దాము.



బుధవారం ఉదయం కూడా దాము ఒక్కడే జమీందారు ఇంటికి వెళ్ళాడు. సోము మధ్యాహ్నం వేళ బయలుదేరాడు.

ఉదయం వచ్చిన దామును జమీందారు మధ్యాహ్నంవేళ చూశాడు. ఆయన దాముకు ఇంత అన్నం పెట్టించి, "రేపు సాయంత్రం కనపడు," అని పంపేశాడు.

దాము ఇంటికి తిరిగి వస్తుండగా అతనికి సోము ఎదురయాడు. సోముతో దాము జరిగినది చెప్పాడు.

"నాకు ముందే తెలుసురా. బిచ్చగాడికి వేసినట్టు ఒక కబళం వేసి పంపించాడన్న మాట. ఈ భాగ్యానికి రేపు సాయంకాలం మళ్ళీ వెళ్ళాలా?" అన్నాడు సోము.

"వెళితే తప్పేం? నిన్ను కూడా రమ్మ న్నారు. పని కావలసినవాళ్ళం రమ్మనప్పుడు వెళ్ళకపోతే ఎలా?" అన్నాడు దాము.

"రేపు సాయంకాలం ఆఖరుసారి వస్తాను. మళ్ళీ రమ్మంటే రాను," అన్నాడు సోము.

మర్నాడు సాయంకాలం ఇద్దరూ కలిసే జమీందారుగారింటికి వెళ్ళారు. జమీందారు సేవకుడు జమీందారుతో మాట్లాడివచ్చి, "మీ పని విషయం రేపు ఉదయం మాట్లాడ తారట. ఈ రాత్రికి మిమ్మల్ని ఇక్కడే ఉండమన్నారు," అని చెప్పాడు.

సోముకు కోపం వచ్చింది. అతను జమీం దారు నౌకరుతో, "పనిలేదు పొమ్మని అప్పుడే చెప్పగూడదూ?" అని, "రారా, దామూ!" అంటూ ఇంటిదారిపట్టాడు.

జమీందారుగారి సేవకుడు లోపలికి పోయి తిరిగివచ్చి, ఒంటరిగా నిలబడి ఉన్న దామును చూసి, "నువు ఉంటున్నావు గదా? ఇది తీసుకుని బట్టల దుకాణానికి వెళ్ళి, ఒక జమఖానా, ఒక దుప్పటీ కొనుక్కురమ్మని జమీందారుగారు చెప్ప మన్నారు," అంటూ అతనికి అయిదు రూపాయలు ఇచ్చాడు.

దాము ఆ రెండు వస్తువులూ కొని, చిల్లరడబ్బులు తెచ్చి జమీందారు కిచ్చాడు. ఆ వస్తువులను జమీందారు తెమ్మన్నది తన కోసమేనని దాముకు తెలిసింది. ఆ రాత్రి జమీందారుగారు పెట్టించిన భోజనమే తిని, జమఖానా పరుచుకుని, దుప్పటి కప్పుకుని దాము నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం జమీందారు దాముతో, "నువు నాకు నచ్చావు. సోమ వారం నుంచీ నువు పనిలో ఉన్నట్టే లెక్క. నీకు నెలకు ముప్పై రూపాయల జీత మిస్తాను. నీ పని ఏమిటంటే, మా జమీం దారీకి చెందిన గ్రామాలకు పోయి, మాకు రావలిసిన దస్తు వసూలు చేసుకురావాలి. అది ఎంతో ఓపికతో చెయ్యవలిసిన పని. పని బాగా చేశావంటే నీ జీతం క్రమంగా పెంచుతాను," అన్నాడు.

దాముకు పని దొరికినందుకు సోము తన తొందరపాటుకు చాలా చింతించాడు.






# 7

[ఖడ్గ జీవదత్తులు గ్రామాధికారి నిర్బంధం నుంచి బయటపడి అరణ్యంలోకి వెళ్ళారు. వాళ్ళ కొక చోట భైరవభక్తుల ముఠా తటస్థపడింది. వాళ్ళ నాయకుడు ఒక కన్యను అపహరించుకు వచ్చాడు. అతడూ, అతని ప్రధాన శిష్యుడూ త్రిశూలాలతో పొడుచుకో బోయారు. ఖడ్గ జీవదత్తులు చెట్టు మీద వుండి యిదంతా చూడసాగారు. తరవాత—]

భైరవభక్తుల్లో కొందరు నిప్పురాజేసి వంట పనుల్లో దిగారు. ఆ ఏర్పాట్లు చూస్తూనే జీవదత్తుడు, "ఖడ్గా! వీళ్ళిప్పట్లో యిక్కణ్ణించి కదిలేలాలేరు. మనం యీ దాపుల నేదైనా కొల నుంటే అక్కడికిపోయి హాయిగా స్నానం చేసి, అడవి ఫలాలు సంపాదిద్దాం," అన్నాడు.

ఆ తరవాత వాళ్ళిద్దరూ నిశ్శబ్దంగా చెట్టు మీది నుంచి దిగి నీటి కోసం వెతుకుతూ బయలుదేరారు. కొద్ది దూరంలోనే వాళ్ళకు సెలయేరొకటి కనిపించింది. అక్కడ కాలకృత్యాలు తీర్చుకుని, ఆ ప్రాంతాల వున్న చెట్లపళ్ళు కోసుకు తిని, తిరిగి రాత్రి తాము గడిపిన చెట్టు దగ్గిరకు వచ్చారు.

ఆ సరికి భైరవుల ముఠా కూడా భోజనాలు ముగించి, ప్రయాణానికి సిద్ధమవుతున్నారు. వాళ్ళు బయలుదేరిపోతున్నది.




పద్మపురరాజ్య సరిహద్దుల అవతల వున్న కొండల కేసి అని గ్రహిస్తూనే, ఖడ్గ జీవదత్తులకు చాలా ఆనందం కలిగింది. వాళ్ళు కూడా సాధ్యమైనంత వేగంగా ఆ రాజ్య సరిహద్దులు దాటి పోవాలనుకుంటున్నారు.

ఆ పగలల్లా భైరవులకు కొంచెం వెనకగా, వాళ్ళను అనుసరించి ఖడ్గ జీవదత్తులు అరణ్యంలో ప్రయాణం చేశారు. అంత పెద్ద ముఠాను పగటివేళ ఎదుర్కొని, వాళ్ళు అపహరించుకు వచ్చిన పిల్లను విడిపించటం ప్రమాదకరమని వాళ్ళిద్దరూ తీర్మానించుకున్నారు.

సూర్యాస్తమయమై క్రమంగా అరణ్యామంతా చీకటి కమ్ముకున్నది. భైరవుల ముఠా ఒకచోట చిన్నచిన్న డేరాలు వేసుకుని, వంట పూర్తవగానే భోజనాలు చేసి నిద్రకు ఉపక్రమించారు. వాళ్ళున్నచోటుకు సమీపంలో వున్న ఒక చెట్టు మీద కూర్చుని ఖడ్గ జీవదత్తులు తగిన సమయం కోసం నిరీక్షిస్తున్నారు.

బాగా పొద్దుపోయింతర్వాత భైరవుల గురువు తన డేరా నుంచి బయిటికి వచ్చి, మరొక డేరా వద్ద కాపలా వున్న వాణ్ణొకణ్ణి పిలిచి, మాట్టాడుతూ ఖడ్గ జీవదత్తులు వున్న చెట్టు కిందికి వచ్చాడు.

ఇప్పుడు ఖడ్గ జీవదత్తులకు, గణలింగేశ్వరుడు తన అనుచరుడికి చెప్పుతున్నదేమిటో స్పష్టంగా వినబడసాగింది. "ఆ కానున్న భైరవీకన్య నిద్రిస్తున్న డేరా, ఆ టేకుమాను కింద వున్నదే గదా! దాని వెనక వున్న గుబురుపొదల్లో పులి ఒకటి తిరుగుతూండటం చూశాను. బహుశా అది కన్యను ఎత్తుకుపోయేందుకు డేరాలోకి జొరపడవచ్చు. మీరు మాత్రం అడ్డుకోకండి. కన్యాభైరవి ధైర్యస్థైర్యాలు ఏపాటివో పరీక్షిద్దాం!" అన్నాడు.

తరవాత వాళ్ళిద్దరూ అక్కణ్ణించి వెళ్ళిపోయారు. అప్పుడు జీవదత్తుడు చిన్న గొంతుతో, "విన్నావా, ఖడ్గా! ఈ భైరవుల గురువు ఆ పిల్లను పులికి మేతగా వెయ్యాలని చూస్తున్నాడు. ఎంతో శ్రమపడి అపహ

రించుకు వచ్చాడు గదా! కారణం సరిగా అర్థం కావటం లేదు," అన్నాడు.

"కారణం అర్థం చేసుకునేందుకు మనం ప్రయత్నించే లోపల ఆ పిల్ల పులి కడుపులో వుంటుంది! అదంతా తరవాత ఆలోచిద్దాం. నువ్విక్కడే వుండు!" అంటూ ఖడ్గవర్మ చెట్టుకొమ్మల్ని పట్టుకుని వూగుతూ, ఆ పిల్ల డేరా వున్న చెట్టు దగ్గిరకు పోయాడు.

భైరవుల గురువు అన్నట్టుగానే పులి ఒకటి, ఆ డేరా పక్కనున్న గుబురుపొదల్లో అటూయిటూ తిరుగుతూ, మధ్యమధ్య ఆగి డేరా కేసి చూస్తున్నది.

"ఓహో, పరిస్థితి చాలా ప్రమాద కరంగా తయారయేట్టుందే!" అనుకున్నాడు, ఖడ్గవర్మ. అతడికి ముందు పులి మీద పడి దాన్ని చంపాలని వున్నది. కాని, ఆ సమయంలో రేగే అలజడికి భైరవులంతా మేలుకోవచ్చు! అలాకాక వాళ్ళు పట్టుకుని తెచ్చిన పిల్లను డేరాలోంచి బయిటికి తీసుకు వచ్చేందుకు ప్రయత్నిస్తే, ఒక వైపు నుంచి పులీ, రెండవ వైపు నుంచి కాపలావాడూ తమ మీదికి రావచ్చు!

ఖడ్గవర్మ యిలా ఆలోచిస్తూ, కాపలా వాడేమి చేస్తున్నాడో చూద్దామని చెట్టుచాటు నుంచి బయిటికివచ్చి, నక్కుతూ పిల్ల వున్న డేరా పక్కకు పోయాడు. తమ గురువు




సలహా వింటూనే భైరవకాపలావాడు, మరొక చెట్టు కింద వున్న డేరా దగ్గిరకుపోయి, దాని ముందు ఎండుపుల్లలతో నెగడు తయారు చేయసాగాడు. భైరవీకన్య ఏమయిపోయినా, తనను పులి ఎత్తుకుపోకుండా వాడు ముందు జాగ్రత్తపడుతున్నాడన్న మాట!

కాపలావాడి ధోరణి ఖడ్గవర్మ చేయ దలుచుకున్నదానికి చాలా అనుకూలంగా కనిపించింది. ఇప్పుడతడికి కాపలావాడి కంటబడతానేమో అన్న భయంలేదు. అతడు భైరవీకన్య వున్న డేరాలోకి వెనక వైపు నుంచి నిశ్శబ్దంగా ప్రవేశించాడు. ఎలుగుచర్మం మీద విచారంగా కూర్చుని వున్న భైరవీకన్య అతణ్ణి చూస్తూనే భయంతో



కంపించి పోయింది. కాని అరిచేందుకు ప్రయత్నించలేదు.

ఖడ్గవర్మ ఆమెను సమీపించి చిన్న గొంతుతో, "అమ్మాయీ, నువ్వెవరో నాకు తెలుసు. మీ నాయన గ్రామాధికారిగా వున్న గ్రామం నుంచే వస్తున్నాను. నిన్ని భైరవులు కొలను దగ్గిర నుంచి అపహరించుకు వచ్చారుగదా?" అని అడిగాడు.

"అవును!" అంటూ భైరవీకన్య తల వూపి, "మిమ్మల్నెప్పుడూ మా గ్రామంలో చూడలేదే!" అన్నది.

"నేను మీ గ్రామం నుంచి వస్తున్నానని చెప్పాగాని, మీ గ్రామస్తుణ్ణని చెప్పలేదు. ఏమైనా అదంత ముఖ్య విషయం కాదు. నీకు తిరిగి నీ తల్లిదండ్రుల వద్దకు వెళ్లాలని వున్నదా, లేక యీ భైరవులకు పూజారిణివి అయి పేరూ, అధికారం చలాయించాలని వున్నదా?" అని అడిగాడు ఖడ్గవర్మ.

"ఛీ ఛీ! ఈ భైరవులు మనుషులా? పట్టి పశుప్రాయులు! వాళ్ళల్లో కాస్త మనిషి అని చెప్పుకోదగ్గవాడు ఆ శ్వేతభైరవుడు ఒక్కడే! మీ చేతనైతే నన్ను రక్షించి, నా తల్లిదండ్రుల దగ్గిరకు చేర్చండి!" అన్నది భైరవీకన్య.

"నువ్వేమీ భయపడకు. తప్పక నిన్ను నీ తల్లిదండ్రుల దగ్గిరకు చేరుస్తాను. అవతల పొదల్లో పులి తిరుగుతూండటం తెలుస్తున్నది గదా? మనం ఇక్కణ్ణించి బయటికి వెళ్ళగానే అది మన మీదికి దూకే ప్రయత్నం చెయ్యవచ్చు. నువ్వు అరవకుండా నా వెనక నిలబడు. ఆ పులి సంగతి నేను చూస్తాను. భయపడి అరిచావో, భైరవభక్తు లంతా వచ్చి మన నిద్దర్నీ పట్టుకుంటారు," అన్నాడు ఖడ్గవర్మ.

ఇద్దరూ చప్పుడు కాకుండా కదిలి డేరా వెనకవైపు నుంచి బయటికి వచ్చారు. అప్పటివరకూ పొదల్లో తిరుగుతూ మధ్య మధ్య గాండ్రిస్తున్న పులి వాళ్ళను చూస్తూనే, పొదల నుంచి బయటికి వచ్చి, వాళ్ళకు ఎదురుగా వెనకకాళ్ళ మీద కూర్చున్నది. ఖడ్గవర్మ ముందు కడుగేసి పులిని



కత్తితో ఒక దెబ్బ కొడదా మనుకున్నాడు గాని, అప్పుడు మరింత గలభా అయి భైరవ భక్తులు లేచి వస్తారని సంశయించాడు.

పులిని అంత దాపుల్లో చూసి, భైరవీకన్య వడవడ వణకసాగింది. ఖడ్గవర్మ ఆమె ముందు నిలబడి ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు. జీవదత్తు డున్న చెట్టు దగ్గిరి కావిధంగా పోయి, కన్యను చెట్టెక్కించాలని అతడి ప్రయత్నం.

కాని పులి వాళ్ళను వదలకుండా వాళ్ళతో పాటు మెల్లిగా ముందుకు నడుస్తూ రాసాగింది. క్రూరమృగాల స్వభావం బాగా తెలిసిన ఖడ్గవర్మ అది ఏ క్షణాన్నయినా తమ మీదికి లంఘిస్తుందని గ్రహించి, కత్తిని సిద్ధంగా వుంచుకున్నాడు. అతడూహించినట్టుగానే అది ఒక్కసారి పెద్దగా అరిచి, ఖడ్గవర్మ మీదికి ఎగిరింది. ఖడ్గవర్మ గురి చూసి దాని తల మీద కత్తితో పొడిచాడు.

కత్తిదెబ్బ తింటూనే పులి భయంకరంగా అరుస్తూ, వెనక్కుపడి, నేల మీద అటూ ఇటూ పొర్లుతూ పొదల్లోకి పోయి పడింది. భైరవుల డేరాల్లో పెద్ద కలకలం బయలుదేరింది. భైరవుల గురువు గణలింగేశ్వరుడు ఒక డేరాలోంచి చప్పున బయటికి వచ్చి, "ఆహాం, భైరవీకన్య నిరాయుధంగా పులితో పోరాడుతున్నది! మీ రెవరూ అడ్డుకోకండి. ఆమె పులి డొక్క చీల్చి పేగులు మెడలో వేసుకుని యిప్పుడే మన దగ్గిరికి రావచ్చు!" అన్నాడు బిగ్గరగా.

భైరవభక్తు లంతా తమ గురువు పక్కన చేరి, పులి అరవటం వినవస్తున్న పొదల కేసి చూడసాగారు. ఈలోపల ఖడ్గవర్మ, భైరవీకన్యతో జీవదత్తు డున్న చెట్టు దగ్గిరికి పరిగెత్తాడు. జీవదత్తుడు అప్పటికే చెట్టు దిగి వున్నాడు. భైరవుల కళ్ళుగప్పి పారిపోవటానికి యిదే మంచి సమయం అని గ్రహించి వాళ్ళు అక్కణ్ణించి బయలుదేరి అరణ్యానికి అడ్డంపడి నడవసాగారు.

గణలింగేశ్వరుడు భైరవీకన్య పులినోట పడిందనే అనుకుంటున్నాడు. ఆమెకు తన

పై కన్న శ్వేతభైరవుడి పైన ఎక్కువ అభిమానం వున్నదనీ, అలాంటి కన్యను భైరవ పూజారిణిగా చేస్తే తనకు ముందు ముందు ప్రమాదం రావచ్చుననీ ఆలోచించి, అతడు ఆమెను పులికి ఆహారంగా వేయ నిశ్చయించాడు. పైకి మాత్రం తన శిష్యులతో ఆమె ధైర్యసాహసాలు పరీక్షించ నున్నట్టు నాటకం ఆడాడు.

శ్వేతభైరవుడికి మాత్రం తమ గురువు ఏదో కుట్ర పన్నాడన్న అనుమానం వున్నది. అతడు గబగబా భైరవీకన్య కోసం కట్టిన డేరా దగ్గిరకు పోయి లోపలికి తొంగిచూశాడు. అక్కడ ఎవరూ లేరు. ఆసరికి అతడికి తమ గురువు మాటల్లోని కపటం, అతడు వేసిన ఎత్తూ అర్థమైంది.

అతడు గురువు వున్న చోటుకు తిరిగి వచ్చి, "గురులింగేశ్వరా! భైరవీకన్య డేరాలో లేదు!" అన్నాడు.

గణలింగేశ్వరుడు అతడి కేసి ఆశ్చర్య పడుతున్నవాడిలా చూసి, "నువ్వే లోకంలో వున్నావ్? ఇంతవరకూ నేను చెపుతున్న దేమిటి? నీకు మతిస్థిమితం ఏమైనా తప్పిందా? భైవవీకన్య ఆ కనబడే పొద లలో పులితో ఒంటరిగా పోరాడుతున్నది!" అన్నాడు.

"కన్య సాహసిలాగే కనబడుతున్నది గాని, పులితో పోరాడేటంత బలం, శక్తి




ఆమెలో వున్నదనుకోను!" అన్నాడు శ్వేత భైరవుడు కోపంగా.

"శక్తీ, బలం లేనివాళ్ళు భైరవపూజకు పనికిరారు. అలాంటి బలహీనురాల్ని పులి తిన్నా వచ్చే నష్టం ఏమీ లేదు. మనం తిరిగి గ్రామప్రాంతాలకు పోయి మరో యోగ్యు రాలైన కన్యను పట్టుకు వస్తాం!" అన్నాడు గణలింగేశ్వరుడు.

ఈ మాటలు శ్వేతభైరవుడికి ఎక్కడలేని కోపాన్నీ తెప్పించినై. కాని అతడు దాన్ని దిగమింగుకుని పొదల కేసి చూస్తూ, "అక్కడ ఏ కదలికా లేదు. పులి అరవటం మానింది. ఎవర్ని ఎవరు చంపారో చూడటం అవసరం గదా!" అంటూ కాగడా ఒకటి

తీసుకుని పొదల కేసి బయలుదేరాడు. అతడి వెనకగా మరి కొందరు భైరవులు నడిచారు.

అందరూ పొదల దగ్గిరకు చేరి, ఒక వేళ పులి పొంచి వున్నదేమో అన్న భయంతో, ముందుగా పొదల మీదికి కొన్ని రాళ్ళు విసిరారు. అటు నుంచి ఎలాంటి ధ్వని గాని, పొదలు కదిలిన సూచన గాని రాలేదు. పులీ, కన్యా యిద్దరూ మరణించయినా వుండాలి, లేదా పులి ఆమెను పట్టుకుని పారిపోయి అయినా వుండాలి, అనుకుంటూ శ్వేతభైరవుడు పొదల్లోకి వెళ్ళాడు.

అక్కడ పులి లేదు, కన్యా లేదు! పొదంతా చిందరవందరగా తొక్కినట్టున్నది. ఆకుల మీదా కొమ్మల మీదా రక్తపు మరకలు కాగడా కాంతిలో మిలమిలా మెరుస్తున్నవి. ఇది చూసి శ్వేతభైరవుడు, కన్యను పులి నోట కరుచుకు పోయిందని భావించి, తన వెంట వున్న వాళ్ళతో, "ఇదంతా మన గురువు పన్నిన కుయుక్తి. అతడు ఒక అమాయిక బాలిక చావుకు కారకుడయ్యాడు. ఇది సహించరానిది!" అన్నాడు.

గణలింగేశ్వరుడు దూరంగా నిలబడి, అంతా చూస్తూనే వున్నాడు. పొదల్లో వున్న పులి శ్వేతభైరవుడి మీద పడుతుందని కూడా అతడు ఆశపడ్డాడు. కాని అక్కడ అంతా నిశ్శబ్దంగా వుండటంతో, అతడు కొంచెం ఆశ్చర్యపోయి, పొదల దగ్గిరకు వెళ్ళి, "శ్వేతా! పులీ, కన్యా కూడా చచ్చారా?" అని ప్రశ్నించాడు.

"ఎవరి శవమూ యిక్కడ లేదు. ఇక్కడ అంతా రక్తమయంగా మాత్రం వున్నది. పులిని కన్యే, కన్యను పులో ఎత్తుకుని ఇక్కణ్ణించి పారిపోయారు!" అన్నాడు శ్వేతభైరవుడు వెటకారంగా.

"మహాభైరవుడు మనను రక్షించి, తనను తాను రక్షించుకున్నాడు! శక్తిహీన, బలహీన అయిన కన్య తనకు పూజారిణి కాకుండా ముందుగానే జాగ్రత్తపడ్డాడు. సరే, ఇక డేరాలు ఎత్తి ప్రయాణానికి సిద్ధంకండి! ఈసారైనా అన్ని అర్హతలూ వున్న కన్యగా చూసి పట్టుకురావటం మంచిది." అన్నాడు గణలింగేశ్వరుడు. —(ఇంకా వుంది)






# మృత్యువుతో పెళ్ళి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ ధైర్యసాహసాలు గొప్పవే గాని, మృత్యువుతో చెరలాడటం ప్రమాదకర మన్నది గుర్తుంచుకో. అలాంటి పని చేసి అనేక కష్టాలకు గురి అయిన మృదుల అనే పిల్ల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక దూరదేశంలో ఒక గ్రామంలో ఒక ఉన్నత కుటుంబంలో ఒక ఆడపిల్ల జన్మించింది. ఆమెకు మృదుల అని పేరు పెట్టుకున్నారు. చిన్నతనంలోనే ఎంతో చక్కని పిల్లగా ఉండిన మృదుల యుక్తవయసు వచ్చేనాటికి సాటిలేని సౌందర్యవతిగా తయారయింది. ఆమెను రోజూ చూసేవారు

## బేతాళ కథలు



కూడా ఆమె అందం చూసి నివ్వెరపో తూండేవారు.

అందరూ తన అందాన్ని పొగుడుతుంటే మృదులకు బాగా అతిశయం ఎక్కిపోయింది. ఆ కారణం చేత ఆమె కంటికి ఎంతటి వాళ్ళూ ఆనేవాళ్ళు కారు. తల్లిదండ్రులు తన కోసం చూసిన సంబంధా లన్నింటినీ ఆమె నిరాకరించింది. మొదట ఆమె అందం ఎలా ప్రసిద్ధి కెక్కిందో, ఇప్పుడు ఆమె అతి శయం అంత ప్రసిద్ధి కెక్కింది. ఆమెకు సంబంధాలు రావటం మానేశాయి. ఆమెను గురించి అందరూ హేళనలాడసాగారు.

అందుచేత ఆమె తన ఇల్లు దాటి బయ టికి వెళ్ళటం కూడా మానేసింది.

గొప్ప కుటుంబంలో పుట్టి, ఎంతో అందం ఉండి తమ కుమార్తెకు పెళ్ళి కాకపోవటం మృదుల తల్లిదండ్రులకు తీరని విచారమై పోయింది. ఒక రోజు ఆమె తల్లి, "ఇక నిన్ను చేసుకుంటామని ఎవరూ రారు కాబోలు!" అన్నది మృదులతో.

"ఎవరూ రాకపోతే మృత్యుదేవత అయినా నా కోసం రాదా?" అన్నది మృదుల చిరాకుగా.

ఆ రాత్రి మృదుల నిద్రపట్టక మంచం మీద పొర్లాడుతూ ఉండగా ఎవరో ఆమె భుజం మీద చెయ్యి వేసి, "మృదులా, నిన్ను పెళ్ళాడటానికి వచ్చాను," అన్నారు.

మృదుల ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూస్తే తెల్లగా ఉన్న అందమైన యువకుడు కనిపించాడు.

మొదట ఆమె ఆశ్చర్యపోయింది. ఆ యువకుడు ఎవరు? లోపలికి ఎలా వచ్చాడు? అతనికి తన పేరు ఎలా తెలి సింది? ఒక వేళ అతను మృత్యుదేవతే నేమో నన్న అనుమానం మనస్సులో మెదలగానే ఆమెకు గుండెదడ పట్టుకుని, ఒళ్ళంతా భయంతో చెమట పట్టింది. ఆ భయంతో ఆమె ఆ యువకుణ్ణి, "నువు ఎవరు?" అని కూడా అడగలేక పోయింది.

ఆ యువకుడు మాత్రం కొంత సేపు సరదాగా కబుర్లు చెప్పి, మళ్ళీ కనిపిస్తా

నంటూ వెళ్ళిపోయాడు. అతను ఎక్కడికి పోతాడో చూడాలని మృదుల అతని వెనకగా తాను కూడా బయలుదేరింది. ఆ యువకుడు వీధి వెంట కొంత దూరం వెళ్ళి, ఒక ఇంట ప్రవేశించి, కొద్ది క్షణాలలో బయటికి వచ్చాడు. మరుక్షణం ఆ యింటి నుంచి ఏడుపులు వినిపించాయి.

అతను మృత్యుదేవతే నని రూఢి చేసుకుని మృదుల ఇంట్లోకి తిరిగి వచ్చింది. తాను నోరు జారి మృత్యువును వరించింది. అందుచేత తనను ఏ క్షణాన అయినా మృత్యువు తన భార్యను చేసుకోవచ్చు. ఈ సంగతి తల్లికి గాని మరొకరికి గాని చెప్పి కూడా లాభం లేదు. తనకు జరగనున్నది ఎవరూ తప్పించలేరు.

ఒక వారం గడిచింది. అర్థరాత్రివేళ ఆమె పడకగది కిటికీ వెలపల నుంచి ఎవరో తనను పేరు పెట్టి పిలిచినట్టయింది. ఆమె కిటికీ వద్దకు వెళ్లి బయటికి చూసింది. ఆ యువకుడే బయట నిలబడి ఉండి, "కిందటిసారి నా వెనకాల వచ్చి ఏం చూశావు?" అని అడిగాడు.

"నేనేమీ చూడలేదే?" అన్నది మృదుల.

"నిజం చెప్పు. లేకపోతే వారం నాటికి నీతండ్రి చనిపోతాడు," అన్నాడా యువకుడు.

"నేనేమీ చూడలేదు," అన్నది మృదుల మళ్ళీ.

ఆ యువకుడు వెళ్ళిపోయాడు. సరిగా వారం తిరిగే సరికి ఆమె తండ్రి పోయాడు.





తానే తండ్రి చావుకు కారణ మయినందుకు మృదుల కుళ్ళికుళ్ళి ఏడ్చింది.

తిరిగి మరొక రోజున ఆ యువకుడు కిటికీ వద్దకు వచ్చి, మృదులను పేరు పెట్టి పిలిచి, "ఆ రోజు నా వెనకగా వచ్చి ఏం చూశావు? నిజం చెప్పు. లేకపోతే ఈ సారి నీ తల్లి పోతుంది," అన్నాడు.

ఆతను మృత్యుదేవత అన్న సంగతి తనకు తెలుసునని బయట పెట్టటం ఇష్టం లేక మృదుల "నే నేమీ చూడలేదు," అని జవాబిచ్చింది.

వారం తిరిగేసరికి మృదుల తల్లి చని పోయింది. మృదులకు కలిగిన దుఃఖం అంతా ఇంతా కాదు. ఆమె దుఃఖ సముద్రంలో కొట్టుకుంటూ ఉండగా ఆ యువకుడు మరోనాడు అర్ధరాత్రి ఆమె కిటికీ వద్దకు వచ్చి, ఆమెను పేరుపెట్టి పిలిచి, అదే ప్రశ్న మళ్ళీ అడిగి, "ఇప్పటికైనా నిజం చెప్పు. లేకపోతే నువే చనిపోతావు," అన్నాడు.

మృదుల మాట్లాడలేదు. అతను అదే ప్రశ్న రెండు మూడుసార్లు అడిగి, ఆమె జవాబు చెప్పకపోయేసరికి, వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు మృదుల మరణించింది. మృదుల శవాన్ని బంధువులు శ్మశానంలో సమాధి చేశారు. కొద్ది రోజులకు ఆ సమాధి మీద ఒక రంగురంగుల బంతి పూవు పూసింది.

ఒక రాజకుమారుడు సపరివారంగా అటుగా వస్తూ, ఆ అపురూపమైన బంతి పూవును చూసి ముచ్చటపడి కోశాడు. సమాధి మీది పువ్వు కోయటం మంచిది కాదని అతని భటులు చెప్పినా ఆ రాజకుమారుడు వినిపించుకోలేదు.

అతనా పువ్వును తెచ్చి తన పడక గదిలో ఉంచి బయటికి వెళ్ళాడు. ఆ రాత్రి అతను పడుకోబోతూ తన పాల కోసం చూస్తే పాత్ర ఖాళీగా వున్నది. వంటవాడి నడిగితే పాత్ర నిండా పాలు పెట్టా నన్నాడు. పాత్ర లోపలి భాగం పాలతో తడిసి ఉండటం చేత పాత్రలో ఉండిన పాలు ఎవరో తాగి

నట్టు స్పష్టమయింది. రాజభవనంలోని వాళ్ళే ఎవరో ఈ పని చేసి ఉంటారని రాజకుమారుడు అనుకుని అందరినీ అడిగాడు, కాని దొంగ దొరకలేదు.

మర్నాడు పొద్దున వంటవాడు వచ్చి, "రాత్రి వంట ఇంట్లో కూడా ఎవరో ప్రవేశించి, మిగిలిన వంటకాలను కొన్నిటిని తినేశారు. తమరు చూస్తూ ఊరుకోకూడదు," అన్నాడు.

రెండు రోజులు వరసగా రాజకుమారుడి పాలను ఎవరో తాగేశారు. వాళ్ళే వంట ఇంట్లో కూడా రాత్రివేళ ప్రవేశించి ఆహారం తినేశారు.

మూడో రోజు రాత్రి రాజకుమారుడు తన పడక గదిలోకి తాను ముందుగానే వెళ్ళి పాలు తెప్పించుకున్నాడు. అయితే అతను ఆ పాలు తాగక పక్క మీద పడుకుని నిద్రపోతున్నట్టు నటించాడు. కొద్ది సేపటికి చీరె గరగరమన్న శబ్దం వినిపించింది. అతను కళ్ళు తెరిచి చూసేసరికి బంతిపువ్వు ఉండిన చోటు నుంచి ఒక అపూర్వ సౌందర్యవతి పాలపాత్ర వద్దకు వచ్చి, పాలు తాగ నారంభించింది. ఆమె ఖాళీ పాత్రను కింద పెట్టేసి వంట ఇంటి కేసి పోబోతూ ఉండగా, రాజకుమారుడు పక్క మీది నుంచి లేచి వెళ్ళి ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

"ఎవరు నువు? పువ్వుగా ఎలా మారావు?" అని అతను అడిగితే మృదుల తన కథ అంతా చెప్పింది.



''నీకూ మృత్యుదేవతకూ ప్రధానం కాలేదుగా? నిన్నతడు చాలా కష్టాలపాలు చేశాడు. నేనే నిన్ను పెళ్ళాడతాను,'' అన్నాడు రాజకుమారుడు మృదులతో.

మర్నాడు మృదుల అందాన్ని చూసి రాజకుమారుడి బంధువు లంతా ఎంతో సంతోషించారు. ఆమె ఎవరు? ఎక్కణ్ణించి వచ్చింది? అన్న ప్రశ్న ఎవరూ అడగలేదు. వారికి వైభవంగా పెళ్ళి అయింది. అనేక మంది పిల్లలను కని మృదుల రాజ కుమారుడితో సుఖంగా జీవించింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, మృదులకు అన్ని కష్టాలు కలిగించిన మృత్యుదేవత ఆమెకు యోగ్యుడైన భర్తను చూపి ఎందుకు సుఖంగా జీవించ నిచ్చాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోతే నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మృత్యుదేవతకు మృదుల మీద ప్రత్యేకంగా పగ ఏదో ఉన్న దనుకునేటందుకు అవకాశం లేదు. అతను మృదులకు చాలా ఉపకారం చేశాడు. మృదుల కుండిన అహంకారాన్ని పూర్తిగా వదల గొట్టేశాడు. ఆమె తన తల్లిదండ్రుల చావుతో ఎంత పశ్చాత్తాపం పొందిందో మనం గ్రహించవచ్చు. తన కోసం మృత్యుదేవత వస్తుందని ఆమె అన్న మాట కూడా అతను నిజం చేశాడు. ఆమెను అతను తీసుకు పోయాడు. అయితే ఆయువు తీరని వారిని మృత్యువు చంపలేదు. ఆమె తల్లిదండ్రులు ఆయువు తీరే పోయారు. అయితే ఆమెను తపింప జెయ్యటానికి మృత్యువు, తాను ఆమెను శిక్షించటానికే వారిని చంపుతున్నట్టు మాట్లాడాడు. మృదులది ఒక్కటే అకాల మరణం. అందుచేతనే మృత్యువు ఆమెను తిరిగి బతికించటానికీ, ఆమెకు తగిన భర్తను చూపటానికీ తగిన ఏర్పాటు చేశాడు. ఆమె పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండటానికి మృత్యువే కారకుడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# ఒకరిని మించి ఒకరు

ఒక దేశంలో దొంగతనాలు జాస్తి అయాయి. అందుచేత ఆ దేశపురాజు పట్టుబడిన ప్రతి దొంగకూ ఉరిశిక్ష వెయ్యసాగాడు. వరసగా అనేక మంది దొంగలు ఉరిపడ్డాక దొంగ తనాలు చాలా తగ్గిపోయాయి.

ఆ దేశంలోనే ఒక ఊళ్ళో కన్నడూ, చిన్నడూ అని ఇద్దరు దొంగలుండే వాళ్ళు. వాళ్ళు కూడబలుక్కుని, "ఇక దొంగ తనాలు అచ్చిరావు. మనం మరోవృత్తి ఏదన్నా చూసుకుందాం. చేసుకోదలిస్తే లోకంలో అనేక వృత్తులున్నాయి," అని తీర్మానించు కున్నారు.

వాళ్ళు ఆ మరసటి రోజునే తమ పక్క గ్రామానికి వెళ్ళి, ఆ వూరి పెద్దరైతు దగ్గిర పనికి కుదిరారు.

రోజూ ఎడ్లను బీడు మీదికి తోలుకుపోయి మేపుకు వచ్చేపనికి కన్నడు కుదిరాడు. తోటకు రోజూ నీళ్ళు తోడిపోసే పని చిన్నడు ఒప్పుకున్నాడు. ఎవరు ఏ పని చేసినా యజమానికి ఒకటే.

మొదటి రోజు ఉదయం కన్నడు ఎడ్లను బీడు మీదికి తోలుకుపోయాడు. ఎడ్లు వాణ్ణి నానా తిప్పలూ పెట్టాయి. వాటిలో అవి కుమ్ములాడు కున్నాయి; అందకుండా పరుగులు తీశాయి; వాళ్ళ పొలాల్లోనూ, వీళ్ళ పొలాల్లోనూ పడ్డాయి. వాటిని అదుపులో ఉంచటం కన్నడికి చాలా కష్టమై పోయింది.

ఈ లోపల చిన్నడు నీరు చేది తోటకు పోయసాగాడు. ఎంత నీరు తోడినా చెట్లకు చాలలేదు. సగం తోట తడిసేసరికే చిన్నడి చేతులు పడిపోయాయి, నడుము విరిగి పోయింది. ఆ పని పూర్తి అయేసరికి సాయంకాలమయింది.

ఆ రాత్రి కన్నడూ, చిన్నడూ ఒకరి పనిని గురించి మరొకరు విచారించారు.

ఎం. అప్పలరాజు

"నాకసలు పని చేసినట్టే లేదు. ఎడ్లను బీడులో వదిలేసి, హాయిగా చెట్లకింద పడుకుని నిద్రపోయాను. అస్తమయం వేళకు అవే నా దగ్గిరికి వచ్చేశాయి. వాటి మువ్వల చప్పుడుకు నిద్రలేచి, వాటిని తోలుకుని హాయిగా ఇంటికి వచ్చేశాను," అన్నాడు కన్నడు.

"నా పనీ అంతే అయింది. చిటికెలో నాలుగు కడవలు తోడేసి తోటంతా తడిపేసి, ఇక చేసేందుకు పనంటూ లేక, హాయిగా మంచంమీద పడుకుని నిద్రపోయాను," అన్నాడు చిన్నడు.

"బాగుంది. రేపు సరదాగా నువు ఎడ్లను మేపుకురా, నేను తోటకు నీరు పెడతాను," అన్నాడు కన్నడు.

చిన్నడు సంతోషంగా ఒప్పుకుంటూ, "నేనూ అదే అందామనుకుంటున్నాను," అన్నాడు.

"నీకు మంచం మీదే పడుకోవాలని ఉంటే మంచం పట్టుకుని మరీ వెళ్ళు, ఒరే!" అన్నాడు కన్నడు చిన్నడితో.

మర్నాడు ఇద్దరూ పనులు మార్చుకుని, సాయంకాలం వేళకు ఒకరి మోసం ఒకరు గ్రహించారు.

అయితే, కన్నడు తోటకు నీరు పోస్తూ ఒక చిత్రం గమనించాడు. ఒక మామిడి చెట్టు మొదట్లో ఎన్ని కడవలు నీరు పోసినా ఇంకిపోతూ వచ్చింది. దాని రహస్యమేమిటో ఆ రాత్రి ఆరాతీయాలని కన్నడు నిశ్చయించుకున్నాడు.



ఆ రాత్రి ఇద్దరూ పడుకున్నప్పుడు తమ పనులను గురించి మాట్లాడనే లేదు. ఇద్దరూ చాలా సుఖంగా నిద్రపోతున్నట్టు పడుకున్నారు.

ఒక రాత్రివేళ కన్నడు లేచి, పక్కనే ఉన్న పలుగు తీసుకుని, మామిడి చెట్టు వద్దకు వెళ్ళి, దాని పాదులో తవ్వ నారంభించాడు.

కొద్దిసేపు తవ్వాక పలుగుపోటుకు ఖంగు మని ఏదో శబ్దమయింది. వెంటనే కన్నడు చుట్టూ కలయజూశాడు. చిన్నడు చీకట్లో వాడి వెనకనే భూతంలా నిశ్శబ్దంగా పొంచి నిలబడి ఉండి, "ఏమిటి ఈవేళప్పుడు తవ్వటం పెట్టావు?" అని అడిగాడు చిన్నగా నవ్వుతూ.

"ఏమీ లేదు. ఈ చెట్టుకు పాదు సరిగా లేదు. నిద్ర పట్టకపోతే పాదు సరి చేస్తు న్నాను," అన్నాడు కన్నడు.

"ఖంగుమని చప్పుడయిందే? అదే మిటి?" అని చిన్నడు మళ్ళీ అడిగాడు.

"ఏదో రాయి అయి ఉంటుంది. వెళ్ళి పడుకుందాం పద," అంటూ కన్నడు పలుగుతో సహా లేచాడు. చిన్నడు తనలోతను నవ్వుకున్నాడు.

ఇద్దరూ వెళ్ళి పడుకున్నారు. చిన్నడు నిద్రపోయాక మళ్ళీ వచ్చి, ఆ ఖంగుమన్న దేమిటో చూద్దామనుకున్నాడు కన్నడు. కాని ముందుగా వాడికే నిద్రపట్టింది.

కన్నడి గురక వినపడగానే చిన్నడు లేచి, పలుగు తీసుకుని మామిడిచెట్టు





వద్దకు వెళ్ళి, పాదులో తవ్వి, లంకె బిందెలు పైకి తీశాడు. వాటిని ఎక్కడన్నా దాయాలి. దగ్గిరలోనే చెరువు ఉన్నది. చిన్నడు లంకెబిందెలను అక్కడికి తీసుకుపోయి, గట్టు పక్కన లోతు అట్టే లేని చోట బురదలో వాటిని కూరిపెట్టి, ఏమీ ఎరగనట్టు తిరిగి వచ్చి పడుకుని, నిశ్చింతగా నిద్రపోయాడు.

కన్నడు తెల్లవారుఝామున లేచి, పలుగు తీసుకుని చెట్టు వద్దకు వెళ్ళాడు. లంకెబిందెల జాడ కనిపించలేదు. తిరిగి వచ్చి చిన్నడి కాళ్ళు చూస్తే వాటికి బురదా, కొంచెం నాచూ అంటుకుని ఉన్నది. చిన్నడే లంకెబిందెలను సంగ్రహించి చెరువులో దాచాడని కన్నడికి అర్థమయింది. వాడు చెరువు వద్దకు వెళ్ళి చూశాడు. చెరువులో ఒక ప్రాంతాన కప్పల అలికిడి లేదు. కన్నడు అక్కడే వెతికి లంకెబిందెలను పట్టుకుని, వాటిని భుజాన పెట్టుకుని, తిన్నగా తమ గ్రామానికి బయలుదేరాడు.

కన్నడు లేచిన కొద్దిసేపటికి చిన్నడు మేలుకున్నాడు. పక్కన కన్నడు లేడు. చెరువుకు వెళ్ళి చూస్తే, తాను దాచినచోట బిందెలు లేవు. కన్నడు బిందెలు తీసుకుని తమ గ్రామానికి బయలుదేరి ఉంటాడని గ్రహించి చిన్నడు అదే దారిన పరిగెత్త సాగాడు.

కొంతదూరం వెళ్ళేసరికి, బిందెల బరువుతో నింపాదిగా నడుచుకుంటూపోతున్న కన్నడు చిన్నడికి కనిపించాడు. చిన్నడు డొంక వదిలేసి, పొలంగట్ల మీదుగా పరిగెత్తి కన్నడి కన్న ముందు వెళ్ళి, మళ్ళీ డొంక ఎక్కి, తన చెప్పుల్లో ఒకటి దారిలో వదిలేసి, మరో నూరు గజాల అవతల తన రెండో చెప్పు కూడా వదిలేసి, ఒక చెట్టు ఎక్కి, దాని గుబురులో దాక్కున్నాడు.

కొంత సేపటికి కన్నడు బిందెలను మోయలేక మోయలేక అటుగా వస్తూ ఒక చోట ఒంటి చెప్పును చూసి, పట్టించుకోకుండా ముందుకు నడిచాడు. కాని మరో నూరు గజాల అవతల మొదటి దాని జత

చెప్పు కనిపించేసరికి వాడికి ఆశ పుట్టింది. కన్నడు అటూ ఇటూ చూసి, ఎక్కడా జన సంచారం లేకపోయేసరికి, బిందెలను కింద దించి, మొదటి చెప్పు కోసం వెనక్కు వెళ్ళాడు.

వెంటనే చిన్నడు చెట్టు దిగి వచ్చి, లంకె బిందెలు ఎత్తుకుని, శక్తి కొద్దీ నడుస్తూ తన ఇల్లు చేరుకున్నాడు.

కన్నడు రెండు చెప్పులూ సంపాదించు కుని వచ్చి చూసేసరికి లంకెబిందెలు లేవు. ఇది చిన్నడి పనేనని నిశ్చయించుకుని, కన్నడు గబగబా నడుచుకుంటూ చిన్నడి ఇంటికి వచ్చాడు.

చిన్నడి ఇల్లు చేరేసరికి కన్నడికి ఇంటి లోపల ఏడుపులూ, పెడబొబ్బలూ వినిపించాయి. కన్నడు ఆశ్చర్యపోయి, "ఏం జరిగింది?" అని అడిగాడు.

చిన్నడు చనిపోయాడని వాడి భార్యా, కొడుకూ చెప్పారు. గుడ్డ కప్పి నట్టింట పడుకోబెట్టి ఉన్నది చిన్నడి శవం. కన్నడు కూడా వాళ్ళతోపాటు కాస్సేపు ఏడ్చి, "ఎంతో స్నేహంగా ఉండేవాళ్ళం. వాడి ఆఖరు కోరిక తీర్చటం తప్ప నేను చేయగలిగిందేమీ లేదు. నా కన్నా తను ముందు చచ్చిపోతే తన శవాన్ని కందిమోళ్ళ మీదుగా లాగమని వాడు నాతో అన్నాడు. వాడి కోరిక తీర్చి స్నేహరుణం చెల్లిస్తాను," అన్నాడు.

ఇలా అని కన్నడు, అకస్మాత్తుగా చిన్నడి శరీరాన్ని అమాంతం ఎత్తుకుని, ఎవరిమాటా వినిపించుకోకుండా, కొట్టిన కంది చేను దగ్గిరికి తీసుకుపోయాడు. కత్తుల్లాగా ఉండే కందిమోళ్ళు తలుచుకుంటే చిన్నడికి కంపరం పుట్టుకొచ్చింది.

చిన్నడు చప్పున కన్నడి భుజం మీది నుంచి జారి, "ఎందుకురా మనలో మనకు పేచీ? రెండు బిందెలున్నాయి గదా, చెరొకటీ తీసుకుని హాయిగా బతుకుదాం. దొంగతనం మానుకున్న వాళ్ళం దొంగబుద్ధులు కూడా మానేద్దాం," అన్నాడు.

ఇద్దరికీ రాజీ కుదిరింది. లంకెబిందెల ధర్మమా అంటూ, ఇద్దరూ సుఖంగా జీవించారు.



# నిరుద్యోగి

ఒక జమీందారుండేవాడు. ఆయన ధర్మాత్ముడూ, ఉదారస్వభావుడూ కావటంచేత బీద సాదలకు విరివిగా సహాయంచేస్తూ ఉండేవాడు.

ఒకరోజు ఒక యువకుడు ఆయన వద్దకువచ్చి, "బాబూ, నేను చాలా కష్టంలో ఉన్నాను. నా తల్లిని, చెల్లెళ్ళనూ నేనే పోషించాలి. ఎక్కడా పని దొరకలేదు. చిన్నపని ఇచ్చి నన్ను కాపాడండి," అన్నాడు.

జాలిగుండె గల జమీందారు, "నువు చెయ్యగల పని ఏదీ మా ఇంటలేదు. ఇంకెక్కడన్నా పని చూసుకో. పని దొరికేదాకా రోజూ నేను సహాయం చేస్తాను," అంటూ ఆ యువకుడికి రెండు రూపాయ లిచ్చాడు.

అది మొదలు కొన్నిరోజులపాటు ఆ యువకుడు ప్రతి సాయంత్రమూ వచ్చి రెండేసి రూపాయలు పుచ్చుకుంటూ వచ్చాడు. తరవాత పది రోజులపాటు అతను రాలేదు. అతనికి పని దొరికింది కాబోలు ననుకున్నాడు జమీందారు.

కాని పదకొండో రోజున అతను మళ్ళీ వచ్చాడు. పని దొరికిందా అని జమీందారు అడిగితే, "లేదండి. ఎవరూ పని ఇవ్వకుండా ఉన్నారు. మీ సహాయం మీదే అందరమూ ఆధారపడి ఉన్నాం," అన్నాడతను.

జమీందారు అతనికి మళ్ళీ రెండు రూపాయ లిచ్చాడు.

"గడిచిన పది రోజులదీ ఇప్పించండి!" అన్నాడా యువకుడు.

"నువు రాలేదేం?" అన్నాడు జమీందారు.

"రోజూ మైలు దూరం నడిచి రావటం కష్టంగదండి?" అన్నాడు యువకుడు.

"డబ్బు కోసం మైలు దూరం నడవలేనివాడివి నువు పని ఏం చేస్తావు? ఇక ఎన్నడూ నాకు నీ ముఖం చూపకు," అన్నాడు జమీందారు.





# తీరిన పగ

శ్రీకాంత్, శంకర్ అనే వాళ్ళిద్దరూ ఒక నౌకలో పని చేసేవారు. శ్రీకాంత్ పని చెయ్యటంలో సమర్థుడూ, బుద్ధిమంతుడూ, విశ్వాసపాత్రుడూనూ. అందుచేత నౌకలో పనిచేసే వారందరికీ అతనంటే చాలా అభిమానం ఉండేది. నౌకాధిపతికి అతనంటే అమితమైన ఆదరం. ఈ కారణంగా శ్రీకాంత్ అంటే శంకర్‌కు ఈర్ష్యగా ఉండేది.

ఒకసారి నౌక నడి సముద్రంలో ఉండగా నౌకాధిపతికి జబ్బు చేసి చనిపోయాడు. ఆ పరిస్థితిలో శ్రీకాంత్ నౌకాధిపతి బాధ్యతలన్నీ తానే నిర్వహించి, నౌకను సురక్షితంగా తీరానికి చేర్చాడు. ఇది చూసి నౌకయజమాని సంతోషించి, శ్రీకాంత్‌కు నౌకాధిపతి పదవి ఇచ్చాడు. ఇలా జరిగినందుకు నౌకలో పని చేసే వారంతా సంతోషించారు. కాని శంకర్ మాత్రం శ్రీకాంత్‌ను మరింతగా ద్వేషించసాగాడు.

శ్రీకాంత్ ఇంటికి వెళ్లి, తనకు నౌకాధిపతి పదవి వచ్చిందని తన తండ్రితో చెప్పాడు. తండ్రి ఈ వార్త విని ఎంతో సంతోషించి, "నాయనా, నువు వెంటనే సుశీల ఇంటికి వెళ్ళి, ఆమెతో నీ పెళ్ళి నిశ్చయం చేసుకురా. నువు సముద్రాల మీద వెళ్ళినప్పుడు ఆమె నన్ను కనిపెట్టుకుని ఉంటుంది," అన్నాడు.

సుశీలా శ్రీకాంతుల వివాహం గురించి అదివరకే మాటలు జరిగాయి. ఆమె ఆ నగరంలో కెల్లా గొప్ప అందగత్తెగా ప్రసిద్ధికెక్కింది. అందుచేత ఆమెను పెళ్ళాడాలని చాలామంది యువకులు ప్రయత్నాలు చేస్తూ వచ్చారు. అలా ప్రయత్నించిన వారిలో రమాకాంతు డనేవాడు ఒకడు. అతను ఆమెను పెళ్ళాడగోరినప్పుడు ఆమె, తాను శ్రీకాంతుణ్ణి తప్ప మరెవరినీ పెళ్ళాడనని రమాకాంతుడితో స్పష్టంగా చెప్పింది.

---

సి. హరిప్రసాద్

---



అందుచేత రమాకాంతుడు కూడా శ్రీకాం తుణ్ణి తీవ్రంగా ద్వేషించాడు.

శంకర్, రమాకాంతుడూ మిత్రులు. రమాకాంతుడు సుశీల చేత లేదనిపించుకుని తిరిగి రావటం శంకర్ చూశాడు. అతనికి సంగతి తెలిసి పోయింది. అతను రమాకాం తుణ్ణి పలకరించి, "ఏమిటి విచారంగా ఉన్నావు?" అని అడిగాడు.

రమాకాంతుడు తనకు జరిగిన పరాభవం గురించి చెప్పాడు.

"నీ దారికి అడ్డంగా ఉన్న ఆ శ్రీకాం తుణ్ణి తొలగించకూడదా?" అన్నాడు శంకర్, రమాకాంతుణ్ణి ఉత్సాహపరచ టానికి గాను.

రమాకాంతుడు నీరసంగా, "శ్రీకాంతు డికి హాని కలిగిస్తే సుశీల ఆత్మహత్య చేసు కుంటానంటున్నది," అన్నాడు.

శంకర్ కొంచెం ఆలోచించి, "అయితే, శ్రీకాంతుడికి ప్రాణాపాయం లేకుండానే నీ దారికి అడ్డు తొలగే ఉపాయం నేను చెబుతాను," అన్నాడు.

రమాకాంతుడికి ఉత్సాహం వచ్చి, "ఏమిటది?" అని అడిగాడు.

"విను. మా నౌక తిరుగు ప్రయాణమై వచ్చేటప్పుడు మా నౌకాధిపతి ఒక దీవిలో నౌకను ఆపి, శ్రీకాంతును అక్కడ ఉండే దేశవిద్రోహి వద్దకు పంపాడు. ఆ విద్రోహి నుంచి శ్రీకాంతుడు ఏదో ఉత్తరం పట్టుకు వచ్చాడు. ఈ సంగతి ప్రభుత్వానికి తెలిస్తే శ్రీకాంతుణ్ణి విచారించి, ఖైదులో పెడతారు. నేనా పని చేయిస్తాను," అన్నాడు శంకర్.

రమాకాంతుడు సుశీల ఇంటి నుంచి వచ్చిన కొద్ది సేపటికి శ్రీకాంతుడు వచ్చి, సుశీల తండ్రితో మాట్లాడి, మర్నాడే తనకూ, సుశీలకూ వివాహం జరిగేటట్టు ఏర్పాటు చేసుకున్నాడు. మర్నాడు పెళ్ళికి అంతా సిద్ధంగా ఉండగా, రక్షకభటులు వచ్చి శ్రీకాంతుణ్ణి పట్టుకుని న్యాయాధికారి దగ్గిరికి తీసుకుపోయారు.

"నన్ను ఎందుకిలాపట్టి తెప్పించారు?" అని శ్రీకాంత్ న్యాయాధికారిని అడిగాడు.



"విద్రోహులతో నీకు సంబంధాలున్నట్టు నీపైన ఆరోపణ జరిగింది," అన్నాడు న్యాయాధికారి. ఆయన దీవిలో జరిగిన విషయం శ్రీకాంత్‌కు జ్ఞాపకం చేశాడు.

"మా నౌకాధిపతి చనిపోతూ తన ఆఖరు కోరికగా నన్ను ఆ మనిషి వద్దకు పంపాడు. ఆ మనిషి నా కొక ఉత్తరం ఇచ్చాడు. ఇంతకన్న నాకేమీ తెలీదు. ఇందులో నేను చేసిన నేరం కూడా ఏమీ లేదు," అన్నాడు శ్రీకాంత్ న్యాయాధికారితో.

"ఆ ఉత్తరం ఏదీ?" అని న్యాయాధికారి అడిగాడు. శ్రీకాంత్ తన జేబులో నుంచి ఉత్తరం తీసి ఇచ్చాడు. న్యాయాధికారి ఆ ఉత్తరాన్ని చూసి కంగారుపడ్డాడు. తన తండ్రికి విద్రోహులతో సంబంధం ఉన్నట్టు ఆ ఉత్తరం స్పష్టం చేసింది. ఈ సంగతి బయటపడితే న్యాయాధికారికి చాలా ప్రమాదం.

"ఈ ఉత్తరం నువు చదివావా?" అని న్యాయాధికారి అడిగాడు.

"లేదండి. ఇతరుల ఉత్తరాలు చదివే అలవాటు నాకు లేదు," అన్నాడు శ్రీకాంత్.

"ప్రస్తుతం నువు కొద్దికాలం పాటు చెరసాలలో ఉండు. నిన్ను త్వరలో విడిపించే ప్రయత్నం నేను చేస్తాను," అని శ్రీకాంతుడికి అభయమిచ్చి, న్యాయాధికారి ఆ ఉత్తరాన్ని అతని ఎదటనే తగలబెట్టేశాడు.

అధికారులు శ్రీకాంతుణ్ణి ఒక దుర్గంలో ఖైదు చేశారు. వారాలూ, నెలలూ గడిచాయి. తన నేరం ఏమిటో తెలుపమనీ, తెలుపని పక్షంలో తనను విడుదల చేయమనీ శ్రీకాంత్ ప్రభుత్వానికి విజ్ఞాపన పంపాడు. అతను విద్రోహులతో కుట్ర చేసిన కారణంగా శిక్ష పొందాడనీ, అతనిని విడుదల చేయటం వీలుకాదనీ జవాబు వచ్చింది.

శ్రీకాంత్ నాలుగేళ్ళపాటు ఖైదు జీవితం అనుభవించి, తనను ఈ స్థితికి తెచ్చినవారి పైన పగ తీర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. కాని అతనికి అవకాశం లేదు.

ఇలా ఉండగా, ఒకనాడు అతనున్న గది గోడలో ఏదో చప్పుడయింది. రెండు,



మూడు రోజులు అలాగే చప్పుడయి, తరవాత గోడరాయి ఒకటి కదిలింది. రాయి తొలగి, పెద్ద రంధ్రం గోడలో ఏర్పడింది. ఆ రంధ్రం కుండా పక్క గదిలోని ఖైదీ శ్రీకాంత్ ఉండే గదిలోకి వచ్చాడు. శ్రీకాంత్ ఆ మనిషిని చాలా ఆశ్చర్యంగా చూశాడు. ఆయన వృద్ధుడు.

ఖైదీ లిద్దరి మధ్యా మైత్రి ఏర్పడింది. రోజూ వాళ్ళు గోడలోని రాయి తొలగించి, కలుసుకుని మాట్లాడుకునేవారు. వృద్ధుడు ఒక మందిరంలో పూజారి. ఆయనను అక్రమంగా ఖైదు చేశారు. శ్రీకాంత్ ఆయనకు తన కథ అంతా చెప్పి, "నన్ను ఎందుకు ఖైదు చేశారో తెలియలేదు," అన్నాడు.

"నువు పెద్ద ఉద్యోగం సంపాదించావు. అందగత్తెను పెళ్ళాడబోయావు. ఈ రెండు కారణాల వల్లా నీకు శత్రువు లేర్పడి ఉంటారు. నిన్ను ఖైదులో పెట్టించి వాళ్ళు లాభం పొంది ఉంటారు," అన్నాడు వృద్ధుడు.

అలా లాభం పొందగలవారు శంకర్, రమాకాంతులేనని శ్రీకాంత్ గ్రహించాడు. కాని న్యాయాధికారి వారితో ఎందుకు చేరి ఉంటాడు? "న్యాయాధికారికి నా మీద విరోధం వుండ నవసరంలేదే," అన్నాడు శ్రీకాంత్.

"నువు తెచ్చిన ఉత్తరం ఎవరికో, ఆ మనిషిని రక్షించటానికి న్యాయాధికారి నిన్ను జైలులో పెట్టి ఉంటాడు. అలా కాకపోతే, న్యాయాధికారి ఆ ఉత్తరాన్ని అధికారులకు ఇవ్వక ఎందుకు తగలబెట్టేస్తాడు?" అన్నాడు వృద్ధుడు.

ఏళ్లు గడిచిపోతున్నాయి. వృద్ధుడు శ్రీకాంతుడికి ఎన్నో విద్యలు నేర్పాడు.

వృద్ధుడికి జబ్బు చేసింది. ఈ జబ్బుతోనే తాను పోతానని ఆయకు తోచింది. అందుచేత ఆయన శ్రీకాంతుణ్ణి దగ్గిరికి పిలిచి, "నాయనా, నా కీ జబ్బు నయం కాదు. నేను పోతాను. నువు నా కొడుకు లాంటివాడివి. నా ధన మంతా సముద్ర తీరాన ఒక కొండగుహలో దాచాను. ఎప్పటి

కైనా నీకు విముక్తి కలిగితే దాన్ని నువు తీసుకుని ఉపయోగించుకో," అన్నాడు.

ఆ రాత్రే వృద్ధుడు చనిపోయాడు. మర్నాడు కాపలా వాళ్ళు వచ్చి, వృద్ధుడి శవాన్ని చూసి, దాన్ని ఒక గోనెలో పెట్టి, మోసేవాళ్ళను తీసుకు రావటానికి వెళ్ళారు. ఈ సమయంలో శ్రీకాంత్ గోడలోని రాయి తీసి, వృద్ధుడి గదిలోకి వచ్చి, గోనెలో నుంచి శవాన్ని తీసి, తన గదిలోకి తీసుకుపోయి పడుకోబెట్టి దుప్పటి కప్పి, తిరిగి తాను వృద్ధుడి గదిలోకి వెళ్ళి, గోడలో ఉండే రాయి ఎప్పటిలాగా పెట్టేసి, ఒక కత్తితో సహా వెళ్ళి గోనెలో దూరి పడుకున్నాడు. శవవాహకులు వచ్చి, గోనె ఎత్తుకుని వెళ్ళి, దాన్ని సముద్రంలో పారేశారు.

శ్రీకాంత్ కత్తితో గోనె చించుకుని బయటికి వచ్చి, ఈదుకుంటూ తీరాన ఉన్న రాళ్ళ మధ్యకు చేరి, అక్కడ దాక్కున్నాడు. మర్నాడు అతను, వృద్ధుడు చెప్పిన గుర్తులను బట్టి గుహ కనుక్కొని అందులో తవ్వాడు. అక్కడ అతని కొక పెట్టె దొరికింది. ఆ పెట్టె నిండా బంగారమూ, రత్నాలూ ఉన్నాయి. శ్రీకాంత్ వాటిలో కొన్ని తీసుకుని, మిగతా వాటితో సహా ఆ పెట్టెను అక్కడే పాతి పెట్టి, తన ఇంటికి చేరుకున్నాడు. అతను ఇంటికి చేరేసరికి అతని తండ్రి చనిపోయాడు, సుశీల రమాకాంతుణ్ణి వివాహమాడింది.

శ్రీకాంత్ వీలు చూసుకుని గుహ నుంచి మిగిలిన బంగారమూ, రత్నాలూ కూడా





తెచ్చుకుని, నగరంలో దివ్యమైన భవనం కట్టించుకుని, కొత్త జీవితం ఆరంభించాడు. అయితే అతనికి మనశ్శాంతి లేదు. తన శత్రువుల పైన పగ సాధించటానికి అతను ప్రయత్నాలు ప్రారంభించాడు.

శ్రీకాంత్ ఖైదులో ఉండిన కాలంలో శంకర్ వర్తకుడుగా చాలా పైకి వచ్చాడు. రమాకాంతుడు ఉన్నత సైనికాధికారి అయాడు; అతను బాగా ధనం సంపాదించాడు. న్యాయాధికారి న్యాయమూర్తిగా పెరిగాడు. శ్రీకాంత్ శత్రువులందరూ బాగుపడి, పైకి వచ్చారు.

ఒకనాడు శ్రీకాంత్ ఒక కుర్రవాణ్ణి ప్రమాదం నుంచి తప్పించడం జరిగింది. ఆ కుర్రవాడు కృతజ్ఞతతో శ్రీకాంతుణ్ణి తన తల్లిదండ్రులకు పరిచయం చెయ్యటానికి తీసుకుపోయాడు. సుశీలా రమాకాంతులే ఆ కుర్రవాడి తల్లిదండ్రులు. సుశీల శ్రీకాంతుణ్ణి పోల్చుకున్నది, కాని రమాకాంతుడు గుర్తించలేదు.

నగరంలోని ధనికశ్రేష్ఠుడు కాపటం చేత శ్రీకాంతుడికి న్యాయమూర్తితో తేలికగా పరిచయం అయింది. న్యాయమూర్తికి రెండో పెళ్ళి భార్య ఉన్నది. ఆమెకు అంతులేని ధనదాహం. డబ్బు కోసం ఆమె ఎంతటి దారుణాలు చెయ్యటానికైనా సిద్ధమేనని తెలుసుకుని శ్రీకాంత్, ఆమె ద్వారా న్యాయమూర్తిపై పగసాధించ నిశ్చయించాడు.

ఒకనాడతను మాటల సందర్భంలో, తన వద్ద క్రమంగా ప్రాణాలు తీసే విషాలున్నాయని అన్నాడు. వాటిని ప్రయోగిస్తే మనిషి మంచాన పడి తీసుకుని మరణిస్తాడనీ, విషప్రయోగం జరిగినట్టు ఎవరూ అనుమానించలేరనీ అన్నాడు. న్యాయమూర్తి భార్య తనకు అలాటి విషం ఇవ్వమని శ్రీకాంతుణ్ణి కోరింది.

శంకర్ పెద్ద ఎత్తున ఓడ వ్యాపారం చేసేవాడు. అతనికి వర్తకులు సరుకు అరువిచ్చేవారు. అతని వర్తకానికి ఓడలను కిరాయి కిచ్చేవారి నుంచి శ్రీకాంత్ ఆ ఓడలను కొని, ఓడ సిబ్బందికి తన వాళ్ళను

ఏర్పాటు చేసి, అవి చేరవలసిన రేవులకు చేరకుండా చూసి, ఆ నౌకలు సముద్రంలో మునిగిపోయినట్టు వార్తలు తెప్పించాడు. బాకీ దార్లందరూ శంకర్‌ను చుట్టి ముట్టి తమ బాకీలు వసూలు చేశారు. శంకర్ దివాలా తీశాడు. ఈ విధంగా శ్రీకాంత్ శంకర్‌పై పగ తీర్చుకున్నాడు.

రమాకాంతుడు సైనికాధికారిగా ఉండి అంత ధనం ఎలా సంపాదించాడన్నది శ్రీకాంత్ అరాతీయగలిగాడు. రమాకాంత్ తన పై అధికారి సొత్తు కాజేసి, అతన్ని ఎవరి చేతనో చంపించాడని తెలుసుకుని, ఆ సంగతి బయటపెట్టాడు. రమాకాంతుణ్ణి విచారణ చేశారు. నిజం బయటపడింది. అవమానం భరించలేక రమాకాంత్ ఆత్మ హత్య చేసుకున్నాడు.

న్యాయమూర్తికి మొదటి భార్యవల్ల ఒక కుమార్తె ఉండేది. న్యాయమూర్తికి ఆమె అంటే చాలా ప్రేమ. న్యాయమూర్తి రెండో భార్య శ్రీకాంత్ విషమని ఇచ్చిన దాన్ని తన సవతి కుమార్తె మీద ప్రయోగించింది. ఆ పిల్లను చనిపోయినట్టు నటించమని శ్రీకాంత్ ముందుగానే హెచ్చరించాడు. తన కుమార్తె నిజంగానే చనిపోయిందనుకుని న్యాయమూర్తి ఆమెను శవపేటికలో పెట్టి సమాధి చేయించాడు. తరవాత శ్రీకాంత్ ఆమెను సమాధి నుంచి తీయించి, ఆమె ప్రేమించిన యువకుడికిచ్చి పెళ్ళిచేశాడు.

తన రెండో భార్య చేసిన విషప్రయోగం వల్ల తన కుమార్తె పోయినట్టు న్యాయమూర్తికి తెలియ వచ్చింది. న్యాయమూర్తి ఆమెను దుర్భాషలాడాడు. తనగుట్టు బయట పడిందని ఆమె ఆత్మహత్య చేసుకున్నది.

తరవాత ఒకసారి న్యాయమూర్తి తన తండ్రి వెంట శ్రీకాంతుణ్ణి చూసి ఆశ్చర్య పోయాడు. శ్రీకాంత్ తాను ఎవరైనదీ బయట పెట్టాడు. అతని కథ అంతా విన్నాక న్యాయమూర్తికి మతిచెడి, పిచ్చి వాడై పోయాడు. న్యాయమూర్తి తండ్రిని శ్రీకాంత్ తన తండ్రిలాగే చూసుకుంటూ, శత్రువుల మీద పగ తీర్చుకున్న సంతృప్తితో సుఖంగా జీవించాడు.



# రాజుగారి చాకలి

ఒక రాజుగారు కొత్తగా ఒక చాకలిని ఏర్పాటు చేసుకున్నాడు. ఒకరోజు ఆయన తన నౌకరును పిలిచి, "మన చాకలి ఇంటికి వెళ్ళి, సాయంకాలం బట్టలు తీసుకురమ్మని చెప్పు," అన్నాడు.

రాజుగారి నౌకరు వెళ్ళేసరికి చాకలి గాడిద మీద ఒక్కొక్క మూటవేస్తూ, "ఏలినవారి మీద ఇవాళ కొంత ఎక్కువ బరువే వేస్తున్నాను. ప్రభువులు నన్ను మన్నించాలి. నా మీద ఆగ్రహించవద్దు. తమ నమ్మినబంటును!" అంటూ అతివినయంగా గాడిదతో మాట్లాడుతున్నాడు.

నౌకరు నిర్ఘాంతపోయి, రాజుగారి దగ్గిరికి తిరిగివెళ్ళి, "మహారాజా, మన చాకలికి మతిపోయింది," అంటూ తాను చూసినదీ, విన్నదీ చెప్పాడు.

రాజుగారు చాకలిని పిలిపించి పలకరిస్తే, వాడు మామూలు మనిషిలాగే మాట్లాడాడు. చివరకు రాజుగారు వాణ్ణి, "నువు నీ గాడిదతో అతిమర్యాదగా మాట్లాడుతున్నావుట, దేనికిరా?" అని అడిగాడు.

"అదా, మహారాజా? మేం తక్కువవాళ్ళం. మాకు తమబోటివాళ్ళతో మాట్లాడే పద్ధతి కష్టపడి నేరవాలి. మాలోమేం, అరే-ఒరే, అనుకుంటాం. మర్యాదగా మాట్లాడటం అభ్యాసం చెయ్యాలంటే నాకు నా గాడిద తప్ప ఇంకెవరున్నారు చెప్పండి?" అన్నాడు చాకలి.





# అలీబాబా నలభైదొంగలు

## 4

మర్జీనా బట్టలు ఉతకటానికి ఉపయోగించే పెద్ద గంగాళం కింద బ్రహ్మాండమైన మంట చేసి, లోటాతో బానలో ఉన్న నూనెను గంగాళానికి తీసుకొచ్చి, నూనె అంతా గంగాళంలోకి వచ్చినాక దాన్ని కళా పెళా కాచింది. తరవాత గాడిదల బొక్కెనతో, కాగే నూనె తీసుకుని, ఒక బాన దగ్గిరికి వచ్చి, దాని మీద ఉన్న పీచు మూత తీసి, నూనెను దభాలున బానలోకి దిమ్మరించింది.

బానలో ఉన్న దొంగ అరిచే అవకాశం కూడా లేకుండా ఆ నూనెలో మగ్గి ప్రాణాలు వదిలాడు. మర్జీనా తాపీగా బానలన్నిటిలోనూ కాగే నూనె పోసి, దొంగలందరినీ చంపేసి, అన్ని బానల మీదా మళ్ళీ పీచు మూతలు కప్పి, గంగాళం కింద మంట ఆర్పేసి, వంటింటికి తిరిగి వచ్చి, కటిక చీకటిలో కాగల దానికోసం ఎదురు చూడసాగింది.

అర్ధరాత్రి అయేసరికి దొంగలనాయకుడు నిద్రలేచి, కిటికీలో నుంచి తొంగి చూశాడు. ఎక్కడా దీపం గాని, అలికిడి గాని లేదు. అందరూ గాఢనిద్రలో మునిగి ఉన్నారనుకుని, అతను తన వెంట తెచ్చుకున్న గులకరాళ్ళను బానల కేసి విసర నారంభించాడు. అవి బానలకు తగిలిన చప్పుడైతే వినబడింది గాని, దొంగలు అయత్తమవుతున్న అలికిడి లేదు. "వెధవలు నిద్రపోయారు," అని గొణుక్కొని అతను ఆవరణలోకి పరిగెత్తుకు వచ్చాడు. అతనికి కమురుకంపు కొట్టి, సంకోచం కలిగింది. ఒక బాన మీది మూత ఎత్తితే, వెచ్చని ఆవిరి పైకి వచ్చింది. అతను ఇంత ఎండుగడ్డి తీసుకుని అంటించి, దాని వెలుగులో బాన లన్నీ పరీక్షించాడు.



తన అనుచరు లందరూ చచ్చిపోయి, ఆవిరి చిమ్ముతున్నారు.

దొంగలనాయకుడికి తనకు కలిగిన భయంకర నష్టం అర్థమయింది. అతను చెంగున ప్రహరీగోడ మీదికి దూకి, వీధిలోకి గెంతి, పిక్కబలం కొద్దీ పరిగెత్తి తమ గుహను చేరి, ఇప్పుడేం చెయ్యాలా అన్న ఆలోచనలో మునిగిపోయాడు.

ఇంటికి ప్రమాదం తొలగిపోయిందని తెలుసు గనక మర్జీనా తెల్లవారే దాకా శాంతంగా వేచి ఉండి, మామూలు వేళకు తన యజమానిని నిద్ర లేపింది. అలీబాబా బట్టలు వేసుకుని కిందికి దిగి వచ్చాక, ఆమె అతన్ని ఒక బాన వద్దకు తీసుకుపోయి, దాని మీద ఉన్న మూత ఎత్తి, "లోపల ఏమున్నదో చూడండి," అన్నది.

అలీబాబా బానలోకి చూసి కంపరమెత్తిపోయాడు. మర్జీనా జరిగిన దంతా చెప్పగా విన్నాక అతను, ఆనందాశ్రువులు రాల్చుతూ, "నిన్ను కన్నది బంగారు కడుపే! నువు చేసిన ఈ సహాయం తీరే రుణం కాదు. ఇక నుంచీ నువే మా పిల్లలలో పెద్దదానివి. అంతేకాక ఇంటి యజమానురాలివి కూడా నువే," అన్నాడు.

అబ్దల్లా సహాయంతో తోటలో ఒక పెద్ద గొయ్యి తవ్వి, అందులో దొంగల శవాలన్నీ పూడ్చి, వాటి బెడద వదిలించుకున్నాడు, అలీబాబా.

అలీబాబా వాళ్ళ జీవితం తిరిగి యధాస్థితికి వచ్చింది. మర్జీనాను వాళ్ళు చిన్న దేవతలాగా చూసుకుంటూ వచ్చారు.

కాసిం చనిపోయాక అతని దుకాణాన్ని అలీబాబా పెద్దకొడుకు చూస్తున్నాడు. ఒక నాడతను తన తండ్రితో, "హుసేన్ మన బజారులో దుకాణం పెట్టినాక, అయిదు సార్లు అతను తన మధ్యాహ్న భోజనం నాతో పంచుకున్నాడు. అందుకు బదులుగా అతన్ని మనం విందుకు పిలవటం భావ్యంగా ఉంటుం దనుకుంటాను," అన్నాడు.

"తప్పకుండా అలాగే చెయ్యరా, నాయనా. ఈ మాట ముందే చెప్పి ఉండ

వలసింది. రేపు శుక్రవారం విశ్రాంతి రోజు గనక, రేపు సాయంత్రం అతన్ని మన ఇంటికి భోజనానికి పిలు. అతను మొహ మాట పడితే ఒత్తిడి చేసి మరీ తీసుకురా!'' అన్నాడు అలీబాబా.

అలీబాబా కొడుకు హుసేన్ అనే కొత్త దుకాణదారును తన వెంట తమ ఇంటికి పిలుచుకు వచ్చాడు. అలీబాబా ద్వారం వద్ద చిరునవ్వుతో ఎదురై, ''ఈ రాత్రి తమరు మా ఆతిథ్యం స్వీకరించాలి,'' అన్నాడు.

చాలా పొడుగైన గడ్డం ధరించి అలీబాబా కొడుకు వెంట వచ్చిన హుసేన్, ''నన్ను క్షమించాలి. నేను చాలా కాలం క్రితమే ఉప్పూ, మసాలా వేసిన భోజనం చెయ్యనని ప్రమాణం చేశాను. అందుచేత మీ ఆతిథ్యం స్వీకరించలేను,'' అన్నాడు.

''దాని కేముంది? మీరు తినని ఉప్పూ, మసాలా లేకుండానే వంట చెయ్యమని చెబుతాను,'' అన్నాడు అలీబాబా. ఆయన మర్జీనా వద్దకు వెళ్ళి, ఆ పూట చప్పిడివంట చేయించమన్నాడు. ఆమె ఆశ్చర్యపడింది గాని, యజమాని చెప్పినట్టే చేయించింది.

రాత్రి అయింది. అతిథి వచ్చి, అలీబాబా తోనూ, అతని కొడుకుతోనూ భోజనానికి కూర్చున్నాడు. వారికి మర్జీనా, అబ్దల్లా వడ్డన చేశారు. మర్జీనా అతిథిని పరీక్షగా చూస్తూ వచ్చింది. భోజనాలు ముగిసి,



ముగ్గురు పురుషులూ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్న సమయంలో ఆమె వెళ్ళిపోయి, నర్తకి వేషం ధరించి తిరిగి వచ్చింది.

ఆమె అవతారం చూసి అలీబాబా నిర్ఘాంత పోయాడు. ఆమె నుదుటి మీద బంగారు మాడలు ధగధగ లాడుతున్నాయి. ఆమె మెడలో అంబరుపూసల చేర్లు వేళ్ళాడు తున్నాయి. ఆమె నడుము చుట్టూ బంగారు వడ్డాణమున్నది. ఆమె చేతులకూ, కాళ్ళకూ బంగారు గజ్జె లున్నాయి. ఆమె మొలను చురకత్తి ఉన్నది. ఆమె కళ్ళకు దట్టంగా కాటుక పట్టించి, కనుకొనలు సాగదీసింది. ఆమె వెనకగా కంజిర పట్టుకుని అబ్దల్లా వచ్చాడు. ఆమె తన యజమాని ముందు




వంగి సలాము చేసి, నృత్యం చేయ నారంభించింది.

ఆమె అలుపు లేకుండా, వంక పెట్టటానికి లేకుండా నృత్యం చేసింది. ఆమె చేతిరుమాలు పట్టుకునీ, పల్లెవాటు పట్టుకునీ నృత్యాలు చేసింది. ఆమె యూదుల లాగూ, గ్రీకుల లాగూ, పర్షియనుల లాగూ నృత్యాలు చేసింది. మగవాళ్ళు ఆమె పాదాల కేసీ, ఆమె కేసీ తన్మయులై చూస్తూ ఉండిపోయారు.

ఆమె బాకు నృత్యం ఆరంభించింది. ఆమె తన బొడ్డున వేళ్ళాడుతున్న ఒర నుంచి బాకును పైకి తీసి, రౌద్రం అభినయిస్తూ, బుసకొట్టే తాచు లాగా నృత్యం చేస్తూ చేతిలోని బాకు మొనతో అన్ని దిక్కులా ఘాడిచి, దాన్ని తన గుండెలకే పెట్టుకున్నది. తరవాత ఆమె బాకు మొనను తన గుండెల మీది నుంచి తీసివేసి, బొంగరం లాగా అతివేగంగా తిరుగుతూ, తన బాకుతో ఉత్తుత్త శత్రువులను ఎడాపెడా పొడుస్తున్నట్టు అభినయిస్తూ వచ్చి, అకస్మాత్తుగా అలీబాబా ముందు మోకరించి, అబ్దల్లా దగ్గిర నుంచి, కంజిర పుచ్చుకుని, యాచిస్తున్నదాని లాగా ముందుకు చాచింది.

ఆమె నర్తకి లక్షణాలను అంత దూరం అనుకరించటం అలీబాబాకు కాస్త చిరాకు కలిగించింది. అయినా అయన కంజిరలో ఒక బంగారు దీనారం వేశాడు. అలీబాబా కొడుకు మరొక బంగారు దీనారం వేశాడు. అతని మిత్రుడైన హుసేను డబ్బు కోసం సంచీ తీస్తుండగా, మర్జీనా అతని మీదికి ఉరికి, బాకుతో గుండెలో ఒక్క పోటు పొడిచింది. హుసేన్ నోరు తెరిచి మళ్ళీ మూసుకుని, ఒక్క దీర్ఘశ్వాస విడిచి, ప్రాణాలు వదిలాడు.

మర్జీనాకు మతి చలించిం దన్న అనుమానం అలీబాబాకూ, అతని కొడుకుకూ ఒకే సారి కలిగింది. కాని ఆమె శాంతంగా, "ఈ ఇంటిని కాపాడటానికి, తగిన బలాన్ని అల్లా నా చేతి కిచ్చినందుకు ధన్యవాదాలు తెలుపుకోవాలి. ఈ త్రాష్టుడు నూనెవర్తకు

డన్న మాట ఎంత నిజమో, హుసేన్, అన్న మాట కూడా అంతే నిజం!'' అంటూ వాడి గడ్డం పట్టి ఊడలాగింది. వెంటనే అలీబాబా దొంగలనాయకుణ్ణి గుర్తించాడు.

ఆమె తన ఇంటిని రెండోసారి రక్షించిం దని స్పష్టం కాగానే అలీబాబా ఆమెను కౌగలించుకుని, నుదురు ముద్దు పెట్టుకుని, ''మర్జీనా, నా తల్లీ! నువు నా కొడుకును పెళ్ళాడి నా కోడలు వవుతావా?'' అన్నాడు. మర్జీనా సంతోషంగా ఒప్పుకున్నది. అప్పటి కప్పుడే అలీబాబా కొడుకుకూ, మర్జీనాకూ శాస్త్రోక్తంగా వివాహం జరిగిపోయింది.

ఆ రాత్రి బాగా పొద్దుపోయాక అలీబాబా దొంగలనాయకుడి శవాన్ని, మిగిలిన దొంగ లను పూడ్చిన ఇంటి వెనక తోటలోని గుంట లోనే పూడ్చేశాడు.

పెళ్ళి అయిన తరవాత చాలాకాలం అలీబాబా గుహ చాయలకు పోలేదు. ఎందు కంటే, ఇంకా ఇద్దరు దొంగలకు లెక్క తేలలేదు. వాళ్ళింకా బతికే ఉన్నారని భయపడి మర్జీనా అలీబాబాను అటుకేసి వెళ్ళవద్దన్నది. అయితే వాళ్ళు అదివరకే చనిపోయారు.

ఒక సంవత్సరం గడిచినాక అలీబాబా తన కొడుకునూ, మర్జీనానూ వెంటబెట్టుకుని అక్కడికి వెళ్ళాడు. మంచి పరిశీలన శక్తి గల మర్జీనా గుహ పరిసరా లంతటా గడ్డి మొలిచి ఉండటమూ, మనుషులు గాని, గుర్రాలు గాని నడిచిన జాడలు లేక పోవ టమూ గమనించి, ''భయం లేదు, మామా. మనం గుహలోకి పోవచ్చు,'' అన్నది.

అలీబాబా రాతి కేసి చెయ్యి చాపి, ''తెరుచుకో సమ్‌సమ్!'' అనేసరికి రాయి తెరుచుకున్నది. లోపలి నిధులను ఎవరూ తాకిన జాడ లేదు. తన అధీనమైన ఆ సంపద అంతా మిగిలిన ఇద్దరికీ అలీబాబా గర్వంగా చూపాడు. వాళ్ళు మూడు సంచుల నిండా బంగారమూ, రత్నాలూ నింపుకుని నగరానికి తిరిగి వెళ్ళారు.

ఈ విధంగా కట్టెలు కొట్టుకునే అలీబాబా నగరంలో కెల్లా ధనికుడూ, గౌరవనీయుడూ అయాడు. —(అయిపోయింది)



# నవాబు - ఆబోతు

ఒకసారి బెంగాలు నవాబు కృష్ణచంద్రుడి రాజ్యానికి సపరివారంగా వచ్చి, రాజధానిలో గుడారాలు వేసి దిగాడు. కొద్దిసేపటికి ఆ గుడారాల వేపుగా ఒక బలిసిన ఆబోతు వచ్చింది. నవాబు తన సైనికుల చేత దాన్ని పట్టించి, ఆ రాత్రికి దాన్ని చంపి వండమని తన వంట వాళ్ళకు ఉత్తరువిచ్చాడు.

క్షణాల మీద ఈ వార్త రాజుగారికి చేరింది. ఆయన విచారంలో మునిగిపోయాడు. ఎందుచేతనంటే, రాజుగారు తన తండ్రి తద్దినానికి దాన్ని అచ్చువేసి, ఆబోతుగా వదిలారు. అది ఇప్పుడు సుల్తానుకూ, ఆయన పరివారానికి ఆహారం కాబోతున్నది.

రాజుగారి విచార కారణం తెలుసుకుని రాజవిదూషకుడైన గోపాలుడు సుల్తాను దర్శనం చేసుకుని, "హుజూర్, మా నగరం ప్రజల తరపున మీకు కృతజ్ఞతలు తెలుపుకుందామని వచ్చాను. ఈ ఆబోతును మీరు కోసి తింటే మాకు పెద్ద పీడ విరగడ అయిపోతుంది. అది దుకాణాలలో జొరబడి ఇష్టం వచ్చినదెల్లా కాజెయ్యటమేగాక, చెప్పరానిది తింటుంది. చాలా అపవిత్రమైనది. అచ్చుపోసిన ఆబోతును ఏమీ చెయ్యటానికి లేదు. కాని మీరు దాన్ని చంపి తిని మాకు తీరని ఉపకారం చెయ్యబోతున్నారు!" అన్నాడు.

"ఛీ, ఛీ!" అంటూ నవాబు ఆబోతును అప్పుడే విడిపించాడు.

రాజుగారు గోపాలుడికి ఎన్నో బహుమానా లిచ్చాడు.






# పితృ భక్తి

ఒకప్పుడు చీనాదేశంలో టోంగ్ అనే పేద యువకుడు ఉండేవాడు. అతని తల్లి అతని పసితనంలోనే పోయింది. అతని పంధొమ్మిదో ఏట అతని తండ్రి కూడా పోయాడు. తండ్రి శ్రమజీవి, జీవితాంతం ఒక్క రాగిడబ్బు మిగల్చలేకపోయాడు. ఆ కారణంగా టోంగ్ బొత్తిగా అనాథగా మిగిలిపోయాడు.

ముందు టోంగ్ తన తండ్రికి ఉత్తర క్రియలు జరిపించి, సమాధి కట్టించాలి. చేతిలో ఒక్క పైస లేకుండా ఇదంతా ఎలా చేయటం? డబ్బు పుట్టించటానికి ఒకటే ఉపాయం ఉన్నది; అదేమిటంటే, టోంగ్ బానిసగా అమ్ముడు పోవటం. అలాటి పని చెయ్యవద్దని అతని మిత్రులు అతనికి సలహా ఇచ్చారు. కాని డబ్బు పుట్టించటానికి వాళ్ళు మరో మార్గం చెప్పలేకపోయారు.

టోంగ్ ఒక అట్టమీద తన ధరా, తాను బానిసగా అమ్ముడు పోవటానికి గల నిబంధనలూ రాసి, ఆ అట్టను మెడకు తగిలించుకుని, బానిసల సంతలో ఒక రాతి అరుగు మీద కూర్చున్నాడు. బానిసలను కొనేవాళ్ళు ఆ అట్టమీద రాసినది చదువుకుని దాటి వెళ్ళిపోయారు. కొందరు టోంగ్‌ను చూసి, దురాశాపరుడని నవ్వుకున్నారు.

కారణమేమంటే, టోంగ్, తాను చిన్న మొత్తానికి అమ్ముడు పోదలచలేదు. తన తండ్రికి శాస్త్రోక్తంగా ఉత్తరక్రియలు చేసి, ఉన్నంతలో అందమైన సమాధి కట్టించటానికి ఎంత ఖర్చు అవుతుందో అంత మొత్తానికే అతను అమ్ముడు పోవాలని నిశ్చయించుకున్నాడు. ఆ బాకీ తాను జన్మలో తీర్చాలన్న ఆశ కూడా పెట్టుకోలేదు; బతికున్నంత కాలమూ బానిసగా జీవించటానికి కూడా సిద్ధమయాడు.

కాని, ఎన్ని గంటలు గడిచినా, అతన్ని కొనేవాడు కనిపించలేదు. తనను తాను

చీనా జానపద కథ

కోరిన ధరకు ఎవరూ కొనరు కాబోలని టోంగ్ భయపడుతూండగా ఎవరో అధికారి అటుగా వచ్చాడు; టోంగ్ మెడకు వేళ్లాడే అట్టమీద రాసినది చదువుకున్నాడు; తన వెంట ఉన్నవాడిచేత టోంగ్‌కు డబ్బిప్పించి, పత్రం రాయించుకున్నాడు.

టోంగ్ కోరిక నెరవేరింది. అతను తండ్రికి మంత్రోక్తంగా ఉత్తరక్రియలు జరిపించి, దానధర్మాలు యథావిధిగా చేసి, తండ్రికి చాలా అందమైన సమాధిని గొప్ప శిల్పిచేత తయారు చేయించి, తనను బానిసగా కొన్న యజమాని వద్దకు చేరి చాకిరి ప్రారంభించాడు. అతనికి ఒక పాక వేసి ఇచ్చారు.

కాలం గడిచిపోతున్నది. టోంగ్ జీవితానికి సుఖమూ, విశ్రాంతీ అన్నవి రెండూ లేవు. తనది బానిస బతుకయిపోయినందుకు అతను విచారించ లేదు. ఈ దశలో కూడా అతను తన తండ్రికి శ్రద్ధగా శ్రాద్ధక్రియలు జరుపుతూ వచ్చాడు.

ఇలా ఉండగా ఒక ఏడు నూర్పిళ్ళ తరుణంలో టోంగ్‌కు జ్వరం పట్టుకున్నది. అతను మంచంలో నుంచి లేవలేకపోయాడు. అతనితోబాటు పని చేసే బానిసలు ఇంకా చాలామంది ఉన్నప్పటికీ, వాళ్ళు తెల్లవారినది మొదలు చీకటిపడినదాకా పొలం పనులలో ఉండటంచేత, టోంగ్‌కు ఉపచారాలు చేసేవాళ్ళు లేకపోయారు. అతను జ్వరం నుంచి కోలుకునేటట్టు కనిపించ లేదు.

ఒకరోజు మిట్టమధ్యాన్నంవేళ టోంగ్ తీవ్రమైన జ్వరంతో ఒళ్ళు తెలియకుండా



పడి ఉండగా, అతని నుదురును ఎవరో చల్లగా తాకినట్టయింది. అతని శరీరాన్ని పట్టి ఉండిన నీరసం క్రమంగా తీసేసినట్టని పించింది. తనలో ఈ మార్పుకు ఆశ్చర్య పడుతూ టొంగ్ కళ్ళు తెరిచి చూశాడు. ఒక అలౌకిక సౌందర్యవతి అతని మీదికి వంగి కనబడింది. "నువు ఎవరు?" అని అడగటానికి అతనికి ధైర్యం చాలలేదు.

ఆమె ఇంకా అతని నుదురు రాస్తూనే, "నేను నీ జబ్బు నయం చేసి, నీకు భార్యగా ఉండటానికి వచ్చాను." అన్నది అతనితో.

ఆమె తనను ఏదో ఆజ్ఞాపిస్తున్నట్టుగా అతనికి అనిపించింది. అతను కంగారుతో మంచం మీదినుంచి లేచి నిలబడి, తన నీరసం పూర్తిగా పోయినట్టు తెలుసు కున్నాడు. తాను భార్యను పోషించే స్థితిలో లేనట్టు చెప్పటానికి కూడా అతనికి ధైర్యం లేకపోయింది. ఆమె ఆ సంగతి గ్రహించి నట్టుగా, "జరుగుబాటు సంగతి నేను చూస్తాను," అన్నది.

టొంగ్ చాలా సిగ్గుపడిపోయి, తన చింకి బట్టల కేసి చూసుకున్నాడు. అయితే ఆమె ధరించిన బట్టలు కూడా అలాటివే. ఆమె ఒంటిన ఎక్కడా ఒక్క ఆభరణం లేదు. ఇద్దరూ పూజామందిరం దగ్గిర మొకరించి, పితృదేవతల పూజ చేసి, భార్యా భర్త లయారు.

వారి వివాహం చాలా విడ్డూరమైనది. ఆమెది ఏ వంశమో, ఎక్కడి నుంచి






వచ్చిందో టోంగ్ అడగలేదు. ఆమె తన పేరు 'చీ' అని చెప్పిందిగాని, తనను గురించి అతనితో ఇంకేమీ చెప్పలేదు. అతను ఆమెను తన యజమానురాలుగా భావించి, ఆమెకు పూర్తిగా దాసుడైపోయి, ఎంతో భక్తితో చూసుకునేవాడు. మిగిలిన బానిసలు తన భార్యను గురించి రకరకాల ప్రశ్నలు అడిగితే అతను ఏమీ చెప్పలేకపోయాడు. ఆమె వచ్చినది మొదలు, అతనికి తనది బానిస బతుకన్న భావం పోయింది.

అతని ఇంటి వాతావరణమే ఆమె రాకతో మారిపోయింది. ఇల్లంతా చక్కగా సర్ది, ఉన్నంతలో అందంగా ఉండేది. టోంగ్ పనికి పోయేలోపల సుష్టుగా భోజనం చేసేవాడు. తిరిగి అతను పొలం నుంచి వచ్చేసరికి భోజనం సిద్ధంగా ఉండేది.

అతని భార్య రోజల్లా మగ్గం ముందు కూర్చుని, రంగురంగుల బొమ్మలతో పట్టు తానులు నేసేది. అవి అపూర్వంగా ఉండేవి. ఆమె నేర్పరితనం గురించి చుట్టుపట్ల అందరికీ తెలిసింది. వర్తకులు రోజూ వచ్చి ఆమె నేసిన పట్టు తానులను డబ్బిచ్చి కొనుక్కు పోయేవారు. కొందరు తమకు కావలసిన విధంగా అడిగి నేయించుకునేవారు. "నీ విద్య మాకు నేర్పు. కోరినంత డబ్బు ఇస్తాం," అని ఆమె నడిగారు. కాని ఆమె నేర్పక, "నేను నేర్పినా మీకు రాదు," అని జవాబిచ్చేది. నిజానికి ఆమె నేసేటప్పుడు ఆమె వేళ్ళు కనిపించేవి కావు.

"జరుగుబాటు సంగతి నేను చూస్తాను," అన్న మాట ఆమె పూర్తిగా నిలబెట్టుకున్నది. పెట్టెలో డబ్బు పేరుతున్నది. ఒకనాడు అతనికి ఆమె పెట్టె తెరిచి, అందులో ఉన్న వెండినాణాలు చూపించి, అందులో నుంచి ఒక కాగితం తీసి అతని కిచ్చింది. అది అతని విడుదల కాగితం. యజమానికి క్రయధనం ముట్టింది. టోంగ్ బానిసత్వం ముగిసింది. టోంగ్ కళ్ళ వెంట ఆనందాశ్రువులు రాలాయి.

"దక్షిణాన నీ కోసం పొలాలూ, పట్టు పురుగుల తోటలూ కొన్నాను. ఇక నువు

మరొకరికి చాకిరీ చేయనవసరం లేదు. నీ చాకిరీ నువు చేసుకోవచ్చు.'' అన్న దామె తన భర్తతో. టోంగ్ ఆమె పాదాల ముందు సాష్టాంగపడబోయాడు. కాని ఆమె అతణ్ణి వారించింది.

అది మొదలు అతని దశ బాగా ఎత్తుకున్నది. అతను ఏం చేసినా కలిసి వచ్చింది. అతని కింద పని చేసేవాళ్ళు అతని పట్ల ఎంతో ప్రేమాభిమానాలు చూపేవారు.

ఇలా ఉండగా ఆ ఇంట్లో మగ్గం ఆడటం మానేసింది. టోంగ్ భార్య గర్భవతి. ఆమె సకాలంలో పండువంటి కొడుకును కన్నది. వాణ్ణి చూడవచ్చిన వారంతా, ''వీడు మామూలు పిల్లవాడు కాడు! వరాన పుట్టిన వాడు! నూరేళ్ళు బతుకుతాడు!'' అన్నారు.

ఆ యేడు చలికాలం ప్రారంభ మవుతూండగా ఒక రాత్రి అంతా భార్యాభర్తలు పిల్లవాణ్ణి గురించీ, భవిష్యత్తు గురించీ ఎడతెగకుండా మాట్లాడుకున్నారు. ఆమె ముఖం చూస్తుంటే అతనికి, ఎప్పటికన్నా ఎక్కువ అందంగా ఉన్నట్టు కనిపించింది.

తెల్లవారబోతూండగా ఆమె చప్పున లేచి, అతని చెయ్యి పట్టుకుని పిల్లవాడి ఉయ్యాల తొట్టె దగ్గిరికి తీసుకుపోయింది. ఎందుకో టోంగ్ ఆమెను చూసి కొద్దిగా బెదిరాడు, ఆమెను మొదటిసారి చూసినప్పుడు బెదిరి నట్టే. అతను కళ్ళు మూసుకుని, అప్రయత్నంగా ఆమె ముందు మోకరించాడు. అతను తల ఎత్తి ఆమె ముఖం కేసి చూసేసరికి ఆమె అవతారం పూర్తిగా మారిపోయింది. ఆమె ఇప్పుడు మామూలు స్త్రీల కన్న చాలా ఎత్తుగా ఉన్నది. ఆమె శరీరంలో నుంచి కాంతులు వెలువడుతున్నాయి.

''నే నిక నిన్ను విడిచి వెళ్ళిపోవాలి. నేను మానవస్త్రీని కాను. నీ కోసం మానవ స్త్రీని అయాను. నా జ్ఞాపక చిహ్నంగా నీకు మన కొడుకు ఉంటాడు. నీ పితృభక్తికి మెచ్చి స్వర్గాధిపతి నన్ను నీ వద్దకు పంపాడు. నే నాయన దగ్గిరికి తిరిగి వెళ్ళాలి. నేను చీ-నియు అనే అప్సరసను,'' అన్న దామె. క్రమంగా ఆమె శరీరకాంతులు తరిగిపోయాయి. ఆమె కనిపించకుండా పోయింది.



# అనుకోని సహాయం

ఒక ఊళ్ళో ఇద్దరు అన్నదమ్ములు. అన్న ఆస్తి కలిగినవాడు, తమ్ముడు బొత్తిగా లేనివాడు. అందుచేత ఒకసారి తమ్ముడు అన్న వద్దకు వెళ్ళి ఒక శేరు రాగులు అరువివ్వమన్నాడు. అన్న లేదు పొమ్మన్నాడు.

ఇది జరిగిన రాత్రి తమ్ముడి తలుపు మీద ఎవరో కొట్టి, "డొంకలో నిధి ఉన్నది తెచ్చుకో!" అన్నారు. తమ్ముడు తలుపు తీసి చూడటానికి కూడా భయపడ్డాడు. కాని ఈ సంగతి అన్నకు చెబితే, "ఈసారి ఆ మాట విన్నప్పుడు నాతో చెప్పు," అన్నాడు.

మర్నాడు రాత్రి మళ్ళీ ఎవరో తమ్ముడి తలుపు తట్టి, "డొంకలో నిధి ఉన్నది తెచ్చుకో!" అన్నారు. తమ్ముడు అన్నను లేపి ఈ మాట చెప్పి వచ్చి పడుకున్నాడు.

అన్న అర్ధ రాత్రి వెళ్ళి చూస్తే, డొంకలో ఒక చచ్చిన గుర్రం కళేబరం కనబడింది. అన్నకు చాలా కోపం వచ్చింది. అతను గుర్రం కాలు కోసి తెచ్చి, తమ్ముడి కిటికీ కుండా లోపల పడేసి వెళ్ళాడు.

అన్న మర్నాడు వచ్చి కిటికీకుండా చూస్తే, తమ్ముడు బంగారు నాణాలు ఎంచు కుంటూ కనపడ్డాడు. డొంకలోకి వెళ్ళి చూస్తే గుర్రం కళేబరం లేదు.

అన్న తమ్ముడి దగ్గిరికి వచ్చి, "ఒరే, మొన్న రాగులు అడిగినట్టున్నావు, ఇవ్వనా?" అన్నాడు.

"ఇప్పుడు అవసరం లేదులే," అన్నాడు తమ్ముడు.






దుశ్శాసనుడు ప్రేరేపించగా దుర్యోధనుడు తండ్రి దగ్గిరికి పోయి, "జూదంలో గెలిచిన దంతా పోగొట్టావు. పాండవులు మనని యుద్ధంలో నిర్మూలించి తీరతారు. వాళ్ళకు అమితమైన బలసంపద ఉన్నది. వాళ్ళను మళ్ళీ జూదం ఆడటానికి పిలిపించు. ఈసారి వాళ్ళను జూదంలో ఓడించి పన్నెండేళ్ళు అరణ్యానికి పంపి, అరణ్యవాసం పూర్తి చేసేలోపల ప్రపంచంలోని రాజు లందరినీ మన పక్షం చేసుకుని, యుద్ధం వస్తే పాండవులను తేలికగా నిర్మూలిస్తాం," అన్నాడు.

ధృతరాష్ట్రుడు దీనికి ఒప్పుకున్నాడు. భీష్మద్రోణ విదురులు మొదలైనవారు అనేకులు వద్దన్నారు. గాంధారి గట్టిగా అడ్డుపడింది; కౌరవకులం నాశనమవుతుందని చెప్పింది. కులం నాశనమైనా సరే, జూదాన్ని ఆపటం తన వశం కాదని ధృతరాష్ట్రుడు భార్యతో అన్నాడు. ఇలా అంటూనే ఆయన పాండవులను జూదానికి అహ్వానించడానికి ప్రాతికామిని పంపాడు.

మళ్ళీ జూదం ఆడటం అపాయకరమని తెలిసి కూడా ధర్మరాజు, తన తమ్ములనూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని, జూదం ఆడటానికి హస్తినాపురం వచ్చాడు.

జూదం ఆడే ముందు శకుని ధర్మరాజుతో, "ఈసారి జూదంలో పందెం ఏమిటంటే, ఓడిపోయినవారు నారబట్టలు కట్టి పన్నెండేళ్ళు అరణ్యవాసం చెయ్యాలి. ఆ తరవాత ఒక ఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి.

**26.** పాండవ వనవాసం



శకుని పాచికలు వేశాడు. ధర్మరాజు పందెం ఓడాడు.

పందెం ప్రకారం ధర్మరాజూ, అతని తమ్ములూ, ద్రౌపదీ నారబట్టలు ధరించి, జడలు దాల్చి, జింకతోళ్లు తీసుకుని వన వాసానికి పోవటానికి సిద్ధమయారు. వాళ్లను చూసి దుశ్శాసనుడు, "ఇంత కాలానికి పాండవులకు కష్టాలు ఆరంభం కావటం చూసి మా జన్మ తరించింది. ఇక దుర్యో ధనుడి ఏలుబడికి అడ్డు ఉండదు. ఐశ్వర్య గర్వంతో ఈ పాండవులు మమ్మల్ని చాలా లోకువ చేసి చూశారు. ఇప్పుడు వారికి తగిన పరాభవం జరిగింది. ఇక వారు అరణ్యమృగాల లాగా జీవిస్తారు. ఇంక మాతో సమాన సంపదగలవారు ఎవరూ ఉండరు," అని, ద్రౌపదితో, "పాంచాలీ, దరిద్రులైన ఈ పాండవులతో అడవులలో ఎందుకు కష్టాలు పడతావు? మా కౌరవు లలో నీ యిష్టం వచ్చిన వాణ్ణి వరించి, దాసదాసీ జనాలతో సమస్త భోగాలూ అనుభ వించు," అన్నాడు.

భీము డీ మాటలు విని సింహం లాగా గర్జిస్తూ, "ఓరీ, పాపీ, శకుని ఆడిన మాయ జూదం మూలాన నీ కింత కావరం వచ్చిందా? లేకపోతే ఇలా వదరగలిగి ఉందువా? నిన్ను యుద్ధంలో కీలూ కీలూ విరిచి చంపేటప్పుడు నిన్నే ఘంటా నే

అజ్ఞాతవాస మప్పుడు బయటపడితే తిరిగి పన్నెండేళ్ళు అరణ్యవాసం చేసి, మళ్ళీ ఒక ఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి. పదమూడేళ్ల అనంతరం ఎవరి రాజ్యాలు వారు ఏలుకో వచ్చు," అన్నాడు.

శకుని తెలిపిన ఈ నియమాలు విని సభలోని వాళ్ళు భయభ్రాంతులయారు. "ధృతరాష్ట్రుడు బుద్ధిలేక, కొడుకు ఆడించి నట్టు ఆడుతుంటే పెద్దలు నివారించరేం?" అని కొందరు గట్టిగా అరిచారు. ధర్మరాజు ఆ మాటలు విని, "రాజధర్మాన్ని పాలిస్తా నని కంకణం కట్టుకున్న నాబోటివాడు, కుట్రదార్లు జూదానికి ఆహ్వానించినా వచ్చి జూదమాడి తీరాలి," అని శకునితో అన్నాడు.

అందరూ వింటారులే. నిన్నేకాదు, నిన్నాశ్ర యించి ఉన్న వారందరినీ యమలోకానికి పంపేస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ!'' అన్నాడు.

తరవాత భీముడు దుర్యోధనుడి కేసి తిరిగి, "ఓరీ, మూర్ఖుడా! అప్పుడే ఏమ యింది? నిన్ను యుద్ధంలో చంపిన నాడు దీని కంతకూ సమాధానం చెబుతాను,'' అన్నాడు.

తరవాత పాండవులు జూదం ఆడిన చోటి నుంచి వెళ్ళి పోయేటప్పుడు భీముడు వెనక్కు తిరిగి సభను చూసి, ''గుర్తుంచు కోండి. యుద్ధంలో ఈ పాపాత్ముడైన దుర్యో ధనుణ్ణి నేను భయంకరంగా చంపుతాను. వీడి స్నేహితుడైన కర్ణుణ్ణి అర్జునుడూ, ఈ శకునిని మా సహదేవుడూ చంపేస్తారు. ఈ దుష్టచతుష్టయానికి మా చేతిలో చావు రాసి పెట్టి ఉన్నది. దాన్ని ఎవరూ తప్పించ లేరు,'' అన్నాడు.

భీముడికి అర్జునుడు అడ్డు వచ్చి, ''వట్టి మాటల వల్ల లాభమేమిటి? ఇంకా పధ్నాలు గేళ్ళకు చేయదలచిన దాన్ని ఇప్పుడే ఎందుకు చాటటం? అది కూడా, పదమూ డేళ్ళూ పూర్తి అయినాక ఈ దుర్మార్గుడు మన రాజ్యం మన కివ్వకపోతే మాట! అప్పుడు అన్నంత పనీ చేద్దాం,'' అన్నాడు.

సహదేవుడు శకునితో, ''ఓరీ, నీచుడా! పాచికలతో మోసం చేసినట్టు కాదు, యుద్ధ



భూమిలో నీ ప్రతాపం చూపించు. భీముడు అన్నట్టుగా నేను నీ ప్రాణాలు తీసి తీరు తాను. ఈ లోపల నీ పనులన్నీ ముగించు కుని, చావటానికి సిద్ధంగా ఉండు,'' అన్నాడు.

నకులుడు రౌద్రంగా, ''ద్రౌపదిని ఈ సభలో పరాభవించిన వారి నందరినీ పురుగులను చంపినట్టు చంపుతాం. ఇవి ప్రగల్భాలు కావు,'' అన్నాడు.

ఇలా పాండవులు తలా ఒక శపథమూ చేసి, ధృతరాష్ట్ర, భీష్మ, బాహ్లిక, కృప, ద్రోణ, అశ్వత్థామ, విదుర, సంజయాది పెద్దల వద్ద సెలవు పుచ్చుకుంటూ, ''మళ్లీ కలుసుకుందాం,'' అని చెప్పారు.



దుష్టచతుష్టయానికి భయపడి మిగిలిన వాళ్ళు ఏమీ అనలేదు గాని, విదురుడు మాత్రం ధర్మరాజుతో, "మోసం చేత ఓడినవాడు ఓటమికి విచారించ నవసరం లేదు. నీకు రత్నాల లాటి తమ్ములూ, బుద్ధిమంతురాలైన ద్రౌపదీ, జ్ఞాని అయిన ధౌమ్యుడూ ఉండగా ఏ లోటూ రాదు. ఐకమత్యం గల మీ అన్నదమ్ముల మధ్య ఎవరూ భేదాలు కలిగించలేరు. మిమ్మల్ని ఎవరూ ఓడించనూ లేరు. మీ తల్లి పెద్దది, మీతోబాటు అరణ్యావాసం చెయ్యలేదు. అందుచేత ఆమెను నా యింట పెట్టుకుని, నేను చూసుకుంటాను. అందుకు నువు సరేనను. వెళ్ళిరా. నీకు శుభం కలుగుగాక. మళ్ళీ కలుసుకుందాం," అన్నాడు; ఇంకా అనేక హిత వాక్యాలు చెప్పాడు.

ధర్మరాజు విదురుడితో, "నీవు నాకు తండ్రీ, గురువూలాటి వాడివి. నువు చెప్పినట్టే నడుచుకుంటాను," అన్నాడు.

ద్రౌపది అంతఃపురంలో ఉన్న కుంతికీ, గాంధారికీ, ఇతర పుణ్యస్త్రీలకూ సమస్కారం చేసి, తన యీడువారిని కౌగలించుకుని, కంట తడి పెడుతూ, "వనవాసానికి పోతాను," అన్నది.

కుంతి ఆమెతో, "నీకు అన్నీ తెలుసును. భర్తల వెంబడి భార్య లుండటం సహజ ధర్మం. అందుచేత నువు కంట తడి పెట్టకు. నువు నిజంగా కోపంతో చూసి ఉంటే ఈ కౌరవులు భస్మమై ఉందురు. నేను నిన్ను ఒక్కటి కోరుకుంటున్నాను. మిగిలిన నలుగురూ ఒక ఎత్తూ, సహదేవుడు ఒక ఎత్తూనూ. వాడు చిన్న తనం నుంచీ సుకుమారుడు, కష్టాలు ఓర్చలేడు. వాణ్ణి కాస్త శ్రద్ధగా కనిపెట్టి ఉండు. వెళ్ళిరా, అమ్మా. ధర్మం జయించి మీకు శుభాలు కలుగుతాయి," అన్నది.

వూడిపోయిన జుట్టుముడితో, పెద్దపెట్టున ఏడుస్తూ ద్రౌపది అంతఃపురం నుంచి బయలుదేరింది. కుంతి ఆమె వెంటనే తన కొడుకుల వద్దకు వచ్చింది. వాళ్ళు ముని వేషాలు వేసుకుని అరణ్యానికి బయలుదేరు

తున్నారు. కుంతి వారిని చూసి కళ్ళవెంబడి అశ్రుధారలు కార్చుతూ, "కొడుకులారా, మీరు ధర్మాన్ని ఎంతో శ్రద్ధగా ఆచరిస్తున్నప్పటికీ మీకు వనవాసం సంప్రాప్తమయింది. దేవుడు అనుకూలించలేదో, లేక నా కడుపున పుట్టినందుకు మీ కిది శిక్ష! అరణ్యాలలో మీరు ఎలా వుంటారో! మీ ఈ దుస్థితి చూడకుండా దేహం చాలించిన మీ తండ్రీ, ఆయనతోపాటే పోయిన మాద్రీ అదృష్టవంతులు. నే నేదో మహాపాపం చేసుకుని, మీ కష్టాలు చూడటానికి బతికి వున్నాను. ఇదివరకు మీతోబాటు కష్టాలన్నీ పంచుకున్నాను. ఇప్పుడు నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళక, మీతోబాటు తీసుకుపొండి. అనాథ రక్షకుడైన కృష్ణుడు కూడా మనకు ఏమీ చేయలేకపోయాడు," అన్నది.

తరవాత ఆమె సహదేవుడితో, "నువు వనవాసం వెళ్ళకు, నాయనా. నువు నాదగ్గిర ఉంటే నా కొడుకు లందరూ దగ్గిర ఉన్నట్టే ఉంటుంది," అని ఆపుకోలేకుండా ఏడవసాగింది. విదురుడు ఆమెను ఎలాగో ఊరడించి, తన ఇంటికి తీసుకుపోయాడు.

పాండవులు తల్లికి మొక్కి, వనవాసానికి బయలుదేరారు. ద్రౌపది తల విరబోసుకుని వారి వెంట నడిచింది. ధర్మరాజు ముఖానికి గుడ్డ కప్పుకున్నాడు. భీముడు తన భుజాలు విశాలంగా పెట్టుకుని నడిచాడు. అర్జునుడు



ఇసక చల్లుకుంటూ వెళ్ళాడు. నకులుడు తన శరీరం నిండా బూడిద పూసుకున్నాడు. సహదేవుడు తన ఒంటినిండా మట్టి చల్లుకున్నాడు. ధౌమ్యుడు వారికి ముందు నడుస్తూ రౌద్ర, యామ్య సామగానం చేశాడు. [అట్ట మీది బొమ్మ]

ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, "పాండవులు వనవాసానికి ఎలా వెళ్ళారు?" అని అడిగితే, ఇలా వెళ్లారని విదురుడు చెప్పాడు.

"ఎందు కలా వెళ్లారు?" అన్నాడు ధృతరాష్ట్రుడు.

"నీ కొడుకులు చేసిన అన్యాయానికి మండిపోతున్న ధర్మరాజు తన చూపుతో ప్రజలు భస్మమై పోతారేమో నని ముఖా



చెప్పటానికి రౌద్రసామం చదివాడు....రాజా, నీ దుర్బుద్ధి మూలంగా కౌరవులకు వినాశం రాబోతున్నది," అన్నాడు విదురుడు.

పాండవులు వెళ్ళిపోయాక దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని దుష్టచతుష్టయం ద్రోణుడి వద్దకు వెళ్ళి, "మహానుభావా, పాండవుల నుంచి గెలుచుకున్న రాజ్యాన్ని మీరు ఏలండి. అందుకు మీ కన్న అర్హుడు లేడు," అన్నారు.

ఆ మాట విని ద్రోణుడు వారితో, "పాండవులను గెలవటం ఎవరి తరమూ కాదు. నా పట్ల ఎంతో అభిమానంగా ఉండే దుర్యోధనాదులను నేను విడవలేను. పాండవులు నియమాన్ని నిర్వర్తించి, యుద్ధానికి సిద్ధపడి తప్పక వస్తారు. నా చేతిలో ఓడిపోయిన ద్రుపదుడు మహాయజ్ఞం చేసి, నన్ను చంపగల కొడుకునూ, అర్జునుడికి భార్య కాదగిన కూతురినీ సంపాదించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రౌపది వివాహం ద్వారా పాండవుల మనిషి అయాడు. దీనికి తోడు కృష్ణుడు కూడా పాండవుల పక్షాన ఉన్నాడు. అర్జునుడితో సమానుడైన అతిరథుడు గాని, మహారథుడు గాని లోకంలో ఎవడూ లేడు. నా చావు ధృష్టద్యుమ్నుడి చేతిలో ఉన్నదని అందరూ ఎరిగినదే. దీని కంతకూ మీరే కారకులు కావటం జరిగింది. ఇంత కన్న విచార కారణం ఏముంటుంది? ఇక

నికి గుడ్డ అడ్డం పెట్టుకున్నాడు. భీముడు లోకానికి తన భుజబలం ప్రదర్శించాడు. ఇసుక చల్లినట్టుగా బాణాలు వేసి శత్రు సంహారం చేస్తానని అర్జునుడు తెలియజేశాడు. తన అందం చూసిన ప్రజలు, తాను పడబోయే కష్టాలను గురించి మరింత విచారిస్తారని నకులుడు బూడిద పూసుకున్నాడు. తన దుఃఖం ప్రజలకు కనబడకుండా సహదేవుడు మట్టికొట్టుకున్నాడు. ద్రౌపది తడి చీర గట్టుకుని, జుట్టు విరబోసుకుని, మరి మధ్నాలుగేళ్ళకు నీ కోడళ్ళు విధవలై, ఇలాగే ఏడుస్తారని సూచించింది. ధౌమ్యుడు దర్భలు చేతబట్టుకుని, రాబోయే యుద్ధంలో చచ్చేవారికి ఉత్తరక్రియలు చేయిస్తానని

మీరు చేయగలిగిన దేమంటే, ఇతరులకు మేలు చేయ దలిస్తే ధర్మంగా ప్రవర్తిం చండి. లేదా, తాటిమాను నీడ లాటి సుఖాలు కావాలంటే, ఈ పదమూడేళ్లూ సుఖాలలో ఓలలాడండి. అటు తరవాత కౌరవ వినాశం తప్పదు,'' అన్నాడు.

ఈ మాటలు విన్న ధృతరాష్ట్రుడు దడు చుకుని విదురుడితో, ''విదురుడా, ద్రోణా చార్యుల మాట నిజం. నువు అరణ్యానికి వెళ్ళి పాండవులను తీసుకురా. వాళ్ళు రామంటే, సన్మానం పొంది మళ్ళీ వెళ్ళ మని చెప్పు,'' అంటూ, మనసు నిప్పులు తొక్కిన కోతి లాగా గిలగిల లాడుతుండగా, నిట్టూర్పులు వదల సాగాడు.

అప్పుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో, ''రాజా, నీ కీ రాజ్యమంతా పాండురాజు గెలిచిపెట్టాడు. అతని కొడుకులను అడవు లకు తోలేశావు. ఇంకేమిటి నీ విచారం?'' అన్నాడు.

''విచారం కాకేమిటి? ఆ పాండవులు అతిరథులూ, యుద్ధం తెలిసిన వాళ్ళూ. అలాటి వాళ్ళతో వైరం వచ్చినాక విచారం ఉండదా?'' అన్నాడు ధృతరాష్ట్రుడు.

''ఈ వైరం నువు బుద్ధి పూర్వకంగా తెచ్చుకున్నదే గద! పెద్దవాడు భీష్ముడూ, గురువైన ద్రోణుడూ, నీ మంత్రి అయిన విదురుడూ వద్దంటుంటే విన్నావు కావు. నీ కొడుక్కు బుద్ధీలేదు, లజ్జాలేదు; ప్రాతి కామిని పంపి, బహిష్ఠ అయి ఉన్న ద్రౌప దిని నిండు సభలోకి రప్పించి, బట్టలు ఊడ దీసి అవమానించాడు. ఆమె ఉసురు నీ కులానికి చేటు. చెట్టు చెడేనాటికి కుక్క మూతి పిందెలు పుడతాయి. వినాశకాలం వచ్చేసరికి దేవతలు బుద్ధి నశింప జేస్తారు. కాలం ఎవరినీ కర్ర తీసుకుని నెత్తి మీద కొట్టదు. కాలం తీరేసరికి అన్యాయం న్యాయంగా కనపడుతుంది,'' అని సంజయు డన్నాడు.

''అవును. పుత్ర మోహం చేత ఎవరు చెప్పినదీ వినక, నా కొడుకు చెయ్యమన్నది చేశాను. ఏం చేసేది? దేవుడే మమ్మల్ని కాపాడాలి!'' అన్నాడు ధృతరాష్ట్రుడు.





# శివపురాణం

## 3

దక్షుడి యాగాన్ని ధ్వంసం చెయ్యటానికి శివుడి ఆజ్ఞతో భద్రకాళీ, వీరభద్రుడూ గణాలను వెంట బెట్టుకుని బయలు దేరేసరికి, అక్కడ దక్షుడు యాగం చేసే చోట ఉత్పాతాలు కలిగాయి. ఉల్కాలు రాలాయి. రక్త వర్షం కురిసింది. ఆకాశం నుంచి పాములూ, తేళ్ళూ, క్రిమికీటకాలూ పడ్డాయి. యాగశాలలో ఉన్న వాళ్ళు కొందరు దక్షుణ్ణి తిట్టారు. మరి కొందరు ప్రాణాలను వెరిచి పారిపోయారు.

ఈ లోపల వీరభద్ర గణాలవాళ్ళు యాగ శాలను చుట్టుముట్టి, బయటికి వచ్చేవారిని బాధించసాగారు. వీరభద్రుడు తన ప్రముఖ అనుచరులతో యాగశాల ప్రవేశించాడు. వాళ్ళందరూ లోపల ఉన్న దేవతలనూ, ఋషులనూ చావ బాదసాగారు. దక్షుణ్ణి చూడగానే వీరభద్రుడికి తన తండ్రి అయిన శివుడి దుఃఖం జ్ఞాపకం వచ్చి ఎక్కడలేని రౌద్రమూ వచ్చింది. అతను దక్షుడి తలను నరికి హోమగుండంలో హోమం చేశాడు.

తరవాత వీరభద్రుడు ఋత్విక్కులనూ, దేవతలనూ, యాగశాలలో ఉన్న మిగిలిన వాళ్ళనూ చూసి, ''ఈశ్వర ద్రోహి అయిన దక్షుడు చేసే యాగానికి వచ్చినందుకు ఫలం అనుభవించండి,'' అని వారిని నానా హింసలూ పెట్టాడు.

దక్షుడి భార్య అయిన ప్రసూతీ, ఇతరులూ వచ్చి వారిని ప్రార్థించి శాంతపరిచారు. అప్పుడు భద్రకాళీ వీరభద్రులు తమ తమ సేనలతో కైలాసపర్వతానికి వెళ్ళి, శివుడికి నమస్కరించి నిలబడ్డారు.

ఈలోపుగా, వీరభద్రుడు మొదలైన వాళ్ల చేత చావు దెబ్బలు తిన్న దేవతలూ, ఋషులూ బ్రహ్మ వద్దకు వెళ్ళి జరిగినది

అట్ట చివరి బొమ్మ



చెప్పారు. బ్రహ్మ వారందరినీ వెంట బెట్టుకుని వైకుంఠానికి వెళ్ళి విష్ణువుతో, వీరభద్రుడు దక్షుడి తల నరికి హోమగుండంలో వెయ్యటమూ, దక్షయాగం విధ్వంసం కావటమూ మొదలైన వివరాలన్నీ చెప్పాడు. అందరూ కలిసి కైలాసపర్వతానికి వచ్చారు. వారు వచ్చేసరికి శివుడు ధ్యానసమాధిలో ఉన్నాడు. అయన చుట్టూ వీరభద్రుడు మొదలైన వాళ్ళూ, గణాలవాళ్లూ ఉన్నారు.

శివుడు సమాధి చాలించి బ్రహ్మ విష్ణులనూ, దేవతలనూ, ఋషులనూ చూసి, అందరినీ కూర్చోమని చెప్పాడు.

విష్ణువు శివుడితో, "సదాశివా, కోపాన్నీ, విచారాన్నీ వదిలి పెట్టు. ప్రకృతి మాయలో పడకు. నిన్ను ద్వేషించినందుకు దక్షుడు ఫలితం అనుభవించాడు. కాని దక్షుడు ప్రారంభించిన యాగం పూర్తి కాకపోతే ప్రపంచానికి అనావృష్టి కలిగి, చాలా నాశనం జరుగుతుంది. అందుచేత నువు దక్షుణ్ణి బతికించి, అతని యాగాన్ని పూర్తి చేయించు," అన్నాడు.

శివుడు అందుకు సమ్మతించి, "మనమందరమూ వెళ్ళి దక్షుడి యాగం పూర్తి అయేటట్టు చేసి, లోకాలను కాపాడదాం," అన్నాడు. వాళ్ళు యాగశాలకు వెళ్ళేసరికి, యాగశాల భీభత్సంగా ఉన్నది. అగ్ని గుండంలో దక్షుడి తల రూపు లేకుండా పోయింది.

శివుడు వీరభద్రుడితో, "నువు ఉత్తర దిక్కుగా వెళ్ళి, ఉత్తరంగా తల పెట్టుకుని పడుకుని ఉన్న వాళ్ళ శిరస్సు నరికి తీసుకురా!" అని పంపాడు.

వీరభద్రుడు ఒక గొర్రెతలను నరికి తెచ్చాడు. దక్షుని మొండానికి ఆ గొర్రెతలను తగిలించి, దక్షుణ్ణి బతికించి, అయన చేత వేదోక్తంగా యాగం పూర్తి చేయించారు. ఈ సారి దక్షుడు శివుడికి కూడా భాగం ఉండేలాగు యాగం చేశాడు. తరవాత ఆయన శివుణ్ణి క్షమాపణ వేడుతూ, "నేను నీ గొప్పతనం తెలుసుకోలేక నిన్ను దూషించాను. నిన్ను దూషించిన ఆ తల

పోయింది. నీ దయవల్ల, నాకు బుద్ధితో కూడిన తల ఏర్పడింది. నా తప్పులు మన్నించి, నన్ను కాపాడు,'' అన్నాడు.

శివుడు దక్షుడి క్షమాపణను ఆమోదించి, ''దక్షా, కారణం లేక కార్యం పుట్టదు. నీ తప్పులను నేను క్షమించాను,'' అని, దక్షుణ్ణి వరం కోరుకో మన్నాడు.

అప్పుడు దక్షుడూ, ఆయన భార్యా మొదలైనవారు, దక్షయాగం జరిగిన చోటు దక్షవాటిక అనే పేరుతో ప్రసిద్ధం కావాలనీ, అది శివుడి నిలయంగా వుండాలనీ కోరారు. శివుడు అందుకు సమ్మతించి భద్రకాళీ వీరభద్రులతో, ''ఈ ప్రదేశానికి అగ్నేయంగా ఉండే గౌతమీతీరాన మీరు మీ గణాలతో నివసించండి,'' అన్నాడు. ఆయన భద్రకాళీ సహితంగా వీరభద్రుణ్ణి గణాధిపతిగా చేసి, సతీదేవి శరీరాన్ని తీసుకుని, బ్రహ్మ విష్ణులతో సహా కైలాసానికి తిరిగి వచ్చి, బ్రహ్మ విష్ణులనూ, ఋషులనూ పంపివేసి, సతీదేవి శరీరాన్ని పక్కన ఉంచుకుని, తపస్సులో మునిగిపోయాడు.

దక్షుడి కుమార్తెలలో స్వధ అనే ఆమె పితృదేవతలకు భార్య అయి, మేనకా, ధన్యా, కళావతీ అనే ముగ్గురు కుమార్తెలను కన్నది. వాళ్ళు చాలా అందగత్తెలు; అందరి కోరికలూ తీర్చుతూ, లోకాలన్నీ తిరుగుతూ ఉండేవారు.



ఒకసారి వారు ముగ్గురూ మహాలక్ష్మీ విష్ణువులను చూడబోయి, వారిని తమ నృత్యగానాలతో ఆనందపరిచి, కూర్చుని కబుర్లు చెబుతూండగా అక్కడికి బ్రహ్మ మానసపుత్రులైన సనకసనందనాదులు వచ్చారు. వారిని చూసి విష్ణువుతో సహా అందరూ ఎదురు వెళ్ళి, నమస్కారాలు చేసి గౌరవించారు, కాని మేనకా, ధన్యా, కళావతులు మాత్రం ఆసనాల నుంచి లేవలేదు.

అది చూసి సనత్కుమారుడు కోపించి, ''మీకు గర్వం బాగా ఎక్కిపోయింది. మీరు స్వర్గంలో ఉండతగరు. భూలోకంలో వారిని పెళ్ళాడి, అక్కడే ఉండిపొండి,'' అని ఆ ముగ్గురినీ శపించాడు.

అప్పుడు వాళ్ళు పశ్చాత్తాప పడి, "మునీశ్వరులారా, అజ్ఞానం చేత చేసిన మా తప్పు క్షమించి, మాకు శాపవిమోచనం అనుగ్రహించండి!" అని వేడుకున్నారు.

దానికి సనకసనందనాదులు, "గర్వానికి ప్రాయశ్చిత్తం గర్వం పోవటమే. ఇక శాపం మాట అంటారా? ఈ శాపం లోకాలకు మేలు కలిగించేదే," అన్నారు. (ఇది ఎలా నిజమయిందంటే, ఈ ముగ్గురికీ పుట్టిన కుమార్తెలు మూడు యుగాలలో అవతార పురుషులను పెళ్ళాడారు. మేనకకు పుట్టిన పార్వతి శివుణ్ణి పెళ్ళాడింది. జనకమహారాజుకూ, ధన్యకూ కుమార్తె అయిన సీత రాముణ్ణి పెళ్ళాడింది. వృషభుడికీ, కళావతికీ పుట్టిన రాధ కృష్ణుణ్ణి పెళ్ళాడింది.)

ఈ సంగతి తెలుసుకుని ఆ ముగ్గురు కన్యలూ తృప్తి పడి, విష్ణువు వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు.

హిమాలయానికి రాజైన హిమవంతుడు చాలా అందమైనవాడు. అతను తన కొండ పైన గల ఆశ్రమాలన్నీ తిరుగుతూ, అక్కడ తపస్సు చేసుకునే దేవతల యోగక్షేమాలూ, మహాఋషుల యోగక్షేమాలూ శ్రద్ధగా విచారిస్తూ ఉండేవాడు. అందుచేత వాళ్లు అతనికి మేనక నిచ్చి వివాహం చేయించారు.

ఒకనాడు హిమవంతుడి వద్దకు బ్రహ్మ, విష్ణువూ, దేవేంద్రుడూ, ఇతర దేవతలూ వచ్చారు. హిమవంతుడు వారికి షోడశోపచారాలూ చేసి, వచ్చిన పని అడిగాడు.

"మహాశక్తి దక్షుడికి సతి అనే కుమార్తెగా పుట్టి, శివుణ్ణి పెళ్ళాడి, శరీరం త్యజించింది. శివుడు సతి పోయాక విరక్తితో తపస్సు చేసుకుంటున్నాడు. ఇప్పుడు తారకాసురు డనేవాడు రాక్షసులకు రాజై లోకాలను క్షోభ పెడుతున్నాడు. మహాశక్తి తిరిగి జన్మించి, శివుణ్ణి పెళ్ళాడి, ఒక కొడుకును కనే దాకా తారకుడు ఇలా లోకపీడ చేస్తూనే ఉంటాడు. అందుచేత నువ్వూ, మేనకా ఆ మహాశక్తిని గురించి తపస్సు చేసి, ఆమె మీకు కుమార్తెగా పుట్టేలాగు వరం పొందండి," అని దేవతలు హిమవంతుణ్ణి హెచ్చరించారు.



ప్రపంచపు వింతలు :

# 113. "ఆసియా కప్పు"

సోవియట్ రష్యా, అఫ్ఘానిస్తాన్, పాకిస్తాన్ సరిహద్దులు కలిసే ప్రాంతంలో పామిర్‌పర్వతాలున్నాయి. వీటిని "ఆసియా కప్పు", "ప్రపంచపు కప్పు" అని కూడా అంటారు. ఈ పర్వతాలలో "వఖన్ మార్గం" అన్నది ఒకప్పుడు ప్రాచ్య పాశ్చాత్య దేశాల మధ్య దారిగా ఉండేది. 700 ఏళ్ళ క్రితం మార్కోపోలో ఈ దారిన తూర్పు దేశాలకు వచ్చాడు. ఈ దారిని ఉపయోగించటం ప్రమాదకరం; సాహసంతో కూడిన పని. బొమ్మలో కనిపించే ప్రాంతం 20,000 అడుగుల ఎత్తున ఉన్నది.



Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

మునగందే ముక్తి వుండదు

పంపినవారు:
ఎం. దేవకి, ఏలూరు

Chandamama, April '71

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

కాల్చిందే గట్టి వుండదు

పంపినవారు:
ఎం. దేవకి, ఏలూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 జూన్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మునగందే ముక్తి వుండదు

రెండవ ఫోటో : కాల్చందే గట్టి వుండదు

పంపినవారు : ఎం. దేవకి,

అశోక్‌నగర్, ఏలూరు-2

బహుమతి మొత్తం రు. 20/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

మీకు ప్రియమైన

# చందమామ

వెల జూలై నెల నుంచి కొంచెంగా పెరుగుతున్నది. విడి సంచిక 90 పైసలు మాత్రమే, సంవత్సర చందా రూ. 10-80 పై. ఈ కొద్దిపాటి వెల హెచ్చింపు జరిగినప్పటికీ, మీరు ఎప్పటి అభిమానంతో పత్రికను ఆదరిస్తారని నమ్ముతున్నాము.



చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మద్రాసు - 26




నమలండి

# చిక్లెట్స్ చూయింగ్ గమ్,

తెలుసుకోండి వాటి మజా

ఊరూర తిరుగుతూ తెచ్చాడు చిక్లెట్స్ బఫూన్
మీ లాంటి పిల్లలకు చిక్లెట్స్ చూయింగ్ గమ్
మీరు ఎరుగని నాల్గు క్రొత్త చూయింగ్ గమ్ రుచులతో
ఆరంజ్, లెమన్, పెప్పర్‌మింట్, టూటి-ఫ్రూటి.

